

# చందమామ


సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'


ఈ నెల బేతాళ కథ ["ధర్మసంస్థాపన"] కె. నాగేశ్వరరావు రచన. అధర్మాన్ని ప్రతిఘటించే వాళ్లు ధర్మ సంస్థాపన చెయ్యటానికి అర్హులని చెప్పటానికి లేదు. అధర్మం సంఘంలో బాగా వేళ్ళు తన్నినప్పుడు దాన్ని నిర్మూలించటానికి ప్రత్యేక వ్యక్తులు చేసే కృషి చాలదు అన్నది ఈ కథలో నీతి.

అప్పులు వసూలు చేసుకోవటం చేతగాని వాళ్ళు వడ్డీవ్యాపారానికి పూనుకోరాదని "బాకీ వసూలు" కథ స్పష్టం చేస్తుంది.


సంపుటి 53 జులై '73 సంచిక 1







వజ్రా దపి కఠోరాణి, మృదూని కుసుమా దపి,
లోకోత్తరాణాం చేతాంసి, కో హి విజ్ఞాతు మర్హతి ? 1

[వజ్రం కన్న కఠినమూ, పువ్వు కన్న మెత్తనా అయిన లోకోత్తరుల మనస్సులను ఎవరు అర్థం చేసుకోగలరు ? ]

అలోక సామాన్య, మచింత్య హేతుకం,
ద్విషంతి మందా శ్చరితం మహాత్మనాం. 2
(కాళిదాసు)

[సామాన్యులకు అలవడనిదీ, కారణం ఊహించరానిదీ అయిన మహాత్ముల పనిని మందబుద్ధులు ద్వేషిస్తారు.]

అనుగన్తుం సతాం వర్త్మ
కృత్స్నం యది న శక్యతే
స్వల్ప మ ప్యనుగంతవ్యం
మార్గస్థో నావసీదతి. 3

[సత్పురుషుల మార్గాన్ని పూర్తిగా అనుసరించటం సాధ్యం కాకపోతే కొంతవరకైనా అనుసరించాలి. మంచి మార్గాన వెళ్ళేవారు నశించరు.]

మహాత్ముల పద్ధతి



# దండి తెలివి

రాహుల్‌పూర్ రాజైన శిలాసింహుడు చనిపోయే నాటికి ఆయన ఏక పుత్రుడు వీరసింహుడు ఇరవై ఒక్క ఏళ్ళ వయసువాడు. తల్లి పోయే నాటికి వీరసింహుడు ఆరు మాసాల పసిగుడ్డు. శిలాసింహుడే అతనికి తల్లీ, తండ్రీ అయి, ఎంతో శ్రద్ధగా పెంచి పెద్ద చేశాడు.

అలాంటి తండ్రి చావు వీరసింహుడికి అశనిపాతం అయింది. అతను అగాధమైన దుఃఖ సముద్రంలో మునిగి పోయాడు. తన హితం కోరినవారు చుట్టూ ఉండినప్పటికీ, అతనికి తాను ఏకాకి అయిపోయినట్టూ, ప్రపంచంలో తనకు ఎవరూ లేనట్టూ అనిపించింది. అతను తన పనులే చూసుకోలేని స్థితిలో పడ్డాడు, ఇక రాచకార్యాలు ఏం చూస్తాడు? అతను రాత్రింబగళ్ళు తన పడక గది దాటి ఇవతలికి రాక, విచిత్రమైన మనోవ్యాధి వాతపడి పోయాడు. వైద్యులు చేసిన చికిత్సలేవీ పనిచెయ్యలేదు. అతను రోజు రోజుకూ మానసికంగానూ, శారీరకంగానూ దుర్బలుడు అవుతూ వచ్చాడు.

రాజవైద్యులందరూ కలిసికూడా రాజకుమారుడికి చికిత్స చెయ్యలేక పోవటం చూసి, మంత్రి మొదలైన వారు నిస్పృహ చెందారు. రాజకుమారుడు ఒకప్పుడు గొప్ప ధైర్యశాలి, బలశాలి, యుద్ధవిద్యలలో ఘటికుడు; కుర్రవాడుగా ఉండగానే చిన్న చురకత్తితో చిరుతపులిని ఎదుర్కొని, చంపేశాడు. కాని తండ్రి మరణించిన అనంతరం అతని బలసాహసాలు తీసివేసినట్టు మాయమయాయి. ఇప్పుడతను చీమ చిటుకు మంటే వణికిపోతాడు.

దేశంలో ఉన్న ఘన వైద్యులందరూ రాజకుమారుడికి చికిత్స చెయ్యలేక పోవటం చూసి, ఆస్థాన ఇంద్రజాలికుడు దండి

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



ప్రధానామాత్యుణ్ణి చేరి, "అయ్యా, ఎవరూ రాజకుమారుడికి మనోధైర్యం కలిగించ లేక పోయారు. నేను ప్రయత్నించి చూతునా?" అన్నాడు.

"చూడు, దండీ! మహా మహా వైద్యులకు లొంగని జబ్బు. నీ పిచ్చి ఇంద్రజాలానికి లొంగి వస్తుందనుకుంటున్నావా?" అని ప్రధానామాత్యుడు అన్నాడు.

"ప్రయత్నించి చూడటంవల్ల నష్టమేమిటి?" అన్నాడు దండి.

ప్రధానామాత్యుడు ఆనందరహితంగా నవ్వుతూ, "అలాగే చూడు!" అన్నాడు.

దండి తన ప్రయత్నాలను వెంటనే ప్రారంభించాడు. ఆయన రాజకుమారుడి గదికి వెళ్ళి, "జయం, జయం! ఇవాళ మీ ఆరోగ్యం ఎలా ఉన్నది?" అన్నాడు.

వీరసింహుడు కళాహీనంగా మందహాసం చేసి, "నా ఆరోగ్యం గురించి ఏ మడుగుతారు? నేను చచ్చిపోతున్నాను. మా నాన్నగారిని చేరుకుంటాను. నా శక్తి అంతా ఆయనతోనే పోయింది. నా శక్తిసామర్థ్యాలన్నీ ఆయనే. ఆయన లేరు గనక నేను ఎందుకూ పనికిరాకుండా పోయాను. నాకీ ప్రపంచంలో ఎవరూలేరు," అన్నాడు.

రాజకుమారుడి జబ్బుకు మూల కారణం దండి గ్రహించాడు. రాజకుమారుడు తండ్రి చాటు పిల్లవాడుగా ఉండి, తండ్రిపై అమితంగా ఆధారపడ్డాడు. తండ్రి చావుతో అతనికి జీవితం శూన్య మనిపించి, మనసును పిరికి పట్టుకున్నది. ఈ పిరికిని వదలగొట్టితే అతను మామూలుమనిషి అవుతాడు.

అతని ఆలోచనలను పెడమార్గాల పట్టించటానికి దండి చిత్రవిచిత్ర మైన కథలు చెప్పి, రాజకుమారుణ్ణి నవ్వించటానికి ప్రయత్నించాడు. దండి ప్రతి రోజూ చేసే ఈ ప్రయత్నంతో రాజకుమారుడి విచారభారం కొంత తగ్గింది.

దీనితో బాటు దండి రాజకుమారుడి వద్ద తన ఇంద్రజాల విద్యలు ప్రదర్శిస్తూ వచ్చాడు. రాజకుమారుడు హాస్య కథలు వింటూ, ఇంద్రజాలం చూస్తూ ఎంతగా

మారాడంటే అతను తన గదికి అంటి పెట్టుకుని ఉండక, అప్పుడప్పుడూ దండి వెంట ఉద్యానంలో పచార్లు చెయ్యనారంభించాడు. రాజకుమారుడిలో కలిగిన ఈ మార్పు ప్రధానామాత్యుడు మొదలైన వారికి ఆశ్చర్యం కలిగించింది.

మరొక నెల గడిచింది. రాజకుమారుడి మనసుకు కొంత స్వస్థత చేకూరింది. అతను అప్పుడప్పుడూ సభకు వెళుతూ వస్తున్నాడు. ఒకనాడు అతను దండి వెంట సభాభవనానికి పోతూ ఉండగా, కప్పు మీదినుంచి గండుపిల్లి ఒకటి అతని మీదికి అరుస్తూ దూకింది.

"పులి! పులి! చచ్చాను! నాన్నా, రక్షించు, రక్షించు!" అని వీరసింహుడు గట్టిగా కేకపెట్టి, కళ్ళు గట్టిగా మూసుకుని, ఆపాదమస్తకం కంపించసాగాడు.

దండి అతనితో, "పులికాదు, కుమారా! పిల్లి. కళ్ళు తెరిచి చూడండి. అకారణంగా భయపడకండి." అన్నాడు.

వీరసింహుడు జంకుతూ, జంకుతూ కళ్ళు తెరిచి, పిల్లిని చూశాడు.

దండి పిల్లిని పట్టుకుని వీరసింహుడికి చూపిస్తూ, "దీన్ని తాకి చూడండి. కేవలమూ పిల్లి! మీరు అనవసరంగా భయపడ్డారు. జ్ఞాపకం లేదా? మీరు చురకత్తి తీసుకుని చిరుతపులితో కలియబడి దాన్ని చంపేశారు. ఇప్పుడు కూడా మీరు తలుచుకుంటే చిరుతపులిని పట్టి చేతులతో చంపగలరు," అన్నాడు.





''ఇప్పుడు నాకా శక్తిలేదు. మా నాన్న గారితో నా బలమూ, శక్తీ పోయాయి. నే నిప్పుడు పసిపిల్ల వాడికన్న కూడా బలహీనుణ్ణి,'' అన్నాడు వీరసింహుడు.

''మీ శక్తులన్నీ పోయినమాట అయితే నిజమేగాని, నేను నా ఇంద్రజాలంతో వాటిని తిరిగి తెప్పిస్తున్నాను. ఇంద్రజాలం సహాయంతో మీ ' కవి పూర్తిగా తిరిగి వస్తాయి. నా ఇంద్రజాల విద్యలు మీకు చూపిస్తూనే ఉన్నానుగద?'' అన్నాడు దండి.

''అవును, చూస్తున్నాను,'' అన్నాడు వీరసింహుడు.

''నా అద్భుతశక్తులలో మీకు నమ్మకం లేదా?'' అని దండి అడిగాడు.

'నమ్మకం ఉన్నది. నేను మీ అద్భుతాలు చాలా చూశాను,'' అన్నాడు వీరసింహుడు.

''ఇకనేం? నా ఇంద్రజాల శక్తితో మీరు వెనకటిలాగే చిరుతపులిని చంపబోతున్నారు,'' అన్నాడు దండి.

వీరసింహుడు దండి కేసి ఏ భావమూ లేకుండా చూసి, ముందుకు సాగాడు.

కప్పు మీదినుంచి వీరసింహుడి పైన పిల్లిని పడవేయించినది దండి మాత్రమే. వీరసింహుడికి తన పిరికితనం మీద అసహ్యం పుట్టి, తిరిగి ధైర్యం రావటం కోసం ఆయన అలాచేశాడు. ఇప్పుడాయన వీరసింహుడి చేత చిరుతపులిని చంపించేటానికి అవసరమైన ఏర్పాట్లు ప్రారంభించాడు. ఆ పనీ చేస్తేనేగాని అతనికి తన పరాక్రమంలో పూర్తివిశ్వాసం కలగదు.

ఆయన రెండు కర్ర పలకలను, పలచగానూ, తేలికగానూ ఉండే వాటిని తీసుకుని వాటిని చిరుతపులి ఆకారంలో కోయించాడు. ఆ రెండు పలకలూ చేర్చినట్టయితే ఆ చిరుతపులి వెనక కాళ్ళ మీద లేచి నిలబడినట్టుగా ఉంటుంది. తరవాత ఆయన ఒక సన్నని లోహపు గొట్టం తీసుకుని, దాన్ని మధ్యనా, చివరలా వంచి (బొమ్మలో చూడండి), రెండు పలకల మధ్యా కనపడకుండా అమర్చి, రెండు పలకలనూ చేర్చి

మేకులతో బిగించి, ఆ కొయ్యి చిరుతపులికి తగినట్టు రంగు వేయించాడు. తరువాత ఆయన, చిరుతపులి బొమ్మలో కనపడ కుండా ఉన్న గొట్టంకుండా తాడు దూర్చాడు. చిరుతపులి బొమ్మ తాడు మధ్యలో ఉన్న ప్పుడు తాడు కొసలలో ఒకటి కాలితో తొక్కి పట్టి, రెండోది చేతిలో పట్టుకోవచ్చు.

దండి ఈ బొమ్మను తీసుకుని వీర సింహుడి వద్దకు వెళ్ళి, "మహారాజా, ఇదుగో చిరుతపులి యంత్రం. ఈ నిర్జీవ మైన బొమ్మ మీద సైతం నా ఇంద్రజాలం ఎలా పనిచేస్తుందో దయచేసి తిలకించండి. ప్రాణం ఉన్న వాటి మీద నా ఇంద్రజాల ప్రభావం మీకు తెలియనే తెలును," అన్నాడు.

ఆయన తాడు కింది చివరను కాలితో పట్టుకుని, పై చివరను ఎడమ చేత్తో పట్టు కుని నిటారుగా నిలబడ్డాడు. తాడుకు ఎగు వగా ఉన్న చిరుతపులి బొమ్మ తాడు వెంబడి దిగి వచ్చింది. అది తన పాదాన్ని చేరగానే దండి దాన్ని తాడు వెంబడి పైకి ఎత్తి, ఏవో మంత్రాలు చదివాడు. బొమ్మ తాడు వెంబడి మళ్ళీ దిగసాగింది.

"చూడండి, మహారాజా, ఈ బొమ్మను మంత్ర బద్ధంచేశాను. ఇప్పుడిది నేను చెప్పి నట్టు వింటుంది... ఆగు!" అన్నాడు దండి.

తాడు వెంబడి దిగి వస్తున్న చిరుతపులి బొమ్మ మధ్యలో ఆగిపోయింది. దండి, "కదులు", అనగానే అది మళ్ళీ దిగ సాగింది; మళ్ళీ ఆగమనగానే ఆగింది.



ఈ వింత చూసి వీరసింహుడు అమి తంగా ప్రభావితుడయాడు. అతను అత్యంత ఆశ్చర్యంతో, "మీ శక్తి అమోఘం!" అన్నాడు దండితో.

దండి శాంతంగా, "మహారాజా, ఈ శక్తి పూర్తిగా నాది కాదు. ఈ యంత్రం మహి మకు ఈ తాయెత్తు చాలావరకు తోడ్ప డింది," అంటూ, తన ఎడమ చేతికి కట్టి ఉన్న తాయెత్తును తీసి వీరసింహుడి ఎడమచేతికి కట్టి, "ఇకనుంచీ ఈ యంత్రం మీరు చెప్పినట్టు కూడా వింటుంది," అని, చిరుతపులి బొమ్మను ముందులాగే ఎత్తి పట్టుకున్నాడు. అది తాడు వెంబడి దిగి వస్తుంటే, వీరసింహుడు, "ఆగు!" అన్నాడు. వెంటనే బొమ్మ తాడు మధ్యలో ఆగి పోయింది.

జరిగిన దేమంటే, తాడును దండి వదు లుగా పట్టుకున్నప్పుడు బొమ్మ దాని వెంట దిగి వచ్చింది. కాని దండి తాడును బిగ లాగినప్పుడు, బొమ్మలోపలి గొట్టంలో ఉన్న వంపు కారణంగా బొమ్మ ఆగిపోయింది.

ఈ సంగతి వీరసింహుడు ఎరగక ఆశ్చర్యపడ్డాడు. తాయెత్తులో అతనికి కుదిరిన విశ్వాసం మూలాన అతని మన స్సుకు బలం చేకూరింది. మనోబలం ఎప్పు డైతే వచ్చిందో, దాని వెంట అతనికి శరీరబలం కూడా తిరిగివచ్చింది.

ఒక రోజు ముందుగానే నిర్ణయించి, ఆ రోజున రాజభవన ప్రాంగణంలో ఒక చిరుతపులిని వదిలారు. దానికి దండి ముందుగా కొంత మత్తుమందు పెట్టిం చాడు. వీరసింహుడు దండిని వెంటబెట్టు కుని వచ్చి, ఆ చిరుతపులిని ఎదుర్కొ న్నాడు. చిరుతపులి అతన్ని చూసి దూరంగా పోయింది. వీరసింహుడు దాన్ని కవ్వించాడు. ఆ కవ్వింపుతో అది ఎగిరింది. ఆ సమయంలో వీరసింహుడు దాన్ని తన కత్తితో పొడిచి చంపేశాడు.

"వీరసింహ మహారాజుకూ జై! మహా రాజు వర్ధిల్లాలి!" అని ప్రేక్షకులు నినా దాలు చేశారు. వీరసింహుడి ముఖం ఆత్మ విశ్వాసంతో విప్పారింది.





# యక్షపర్వతం

## 14

[గురుభల్లూకుడి శిష్యులు ఖడ్గజీవదత్తుల్ని ఒక సొరంగ మార్గం ద్వారా తీసుకుపోయి, తోడేళ్ళబండ మీదికి ఎక్కించారు. రాత్రి గడిచి తెల్లవారుతూండగా, తోడేళ్ళకు ఆహారం వెయ్యటానికి వచ్చిన భల్లూకుడి శిష్యులను ఖడ్గవర్మ బాణంతో కొట్టాడు. ఆ సంగతి తెలిసిన గురుభల్లూకుడు కోపంతో పంచశూలం తీసుకుని బయలుదేరాడు. తరవాత—]

ఖడ్గవర్మ వదిలిన బాణం దెబ్బతిని చావు కేక పెడుతూ భల్లూకభటు డొకడు సొరంగంలో పడిపోవటం చూస్తూనే, ఖడ్గ జీవదత్తులకు యిక తమకు తోడేళ్ళ నుంచి కాక, వాటిని పెంచుతున్న భల్లూకంగాళ్ళ నుంచి ప్రమాదం వస్తుందన్న అనుమానం కలిగింది.

జీవదతుడు సొరంగం మీదవున్న ద్వారం కేసి కొంచెం సేపు పరీక్షగా చూసి, దాని దగ్గిరకు మరే భల్లూకభటుడూ రాకపోవటంతో తలతిప్పి, "సమరబాహూ! త్వరలో మనకు రెండు వైపుల నుంచి ప్రమాదం రాబోతున్నది. ఒకటి; మనం నిలబడి వున్న తోడేళ్ళబండ కింద వున్న కంత వైపునుంచి, రెండవది; ఆ కనబడే సొరంగం పైనవున్న ద్వారం నుంచి," అన్నాడు.

ఆ మాట వింటూనే సమరబాహు వెలవెలబోయి, "అయ్యో, యిక్కడ మీరిద్దరూ



నాయకులు. మా ప్రాణరక్షణ మీ చేతిలో వుంది. నన్నూ, నా తోటివాణ్ణీ ఏంచేయ మంటారో, మీరే ఆజ్ఞాపించండి," అన్నాడు.

సమరబాహు భయంచూసి, ఖడ్గవర్మకు నవ్వొచ్చింది. కాని అతడు దాన్నాపుకుని, "సమరబాహూ, నువ్వు సింధు ఎడారుల నుంచి ఏదో సామ్రాజ్యం స్థాపించేందుకు యీ పర్వతారణ్య ప్రదేశాలకు వచ్చినట్టు, విఘ్నేశ్వరపూజారీ, స్వర్ణాచారీ కూడా మాకు చెప్పారు. మనం యిప్పుడున్న ప్రాణాపాయస్థితి నుంచి బతికి బయట పడేందుకు సొంతంగా నువ్వేమైనా ఉపాయం ఆలోచించ లేవా?" అని అడిగాడు.

"ఉపాయమా? అవతలి శత్రువులు ఏ సుక్షత్రియులో అయివుంటే కత్తిదూసి ముఖాముఖి నెదుర్కొని హతంచేసి వుండే వాణ్ణి! కాని, యీ తోడేళ్ళనూ; భల్లూక చర్మాలను ధరించి మంత్ర తంత్రాలు ప్రయోగించే మనుషుల్నీ ఎలా ఎదిరించేది?" అన్నాడు సమరబాహు చేతులూ, కాళ్లూ వణుకుతూండగా.

జీవదత్తుడా మాటలకు నవ్వి, "సమర బాహూ, నీ ప్రతాపం చూపించటానికి సమయం అసన్న మైంది. మనం వున్న బండ కింది కంతకుండా శత్రువులు పైకెక్కి రాకుండా నువ్వూ, నీ అనుచరుడూ చూడండి. బహుశా, యీ సరికి తన శిష్యుడొకడు బాణం దెబ్బకు చచ్చినట్టు, ఆ గురుభల్లూకుడికి తెలిసి వుంటుంది. వాడెక్కడున్నట్టు? ఏంచేయ బోతున్నట్టు?" అన్నాడు.

జీవదత్తుడు మాట ముగించే లోపలే గురుభల్లూకుడు సొరంగ ద్వారం దగ్గిరకు వచ్చి, తోడేళ్ళబండ మీద వున్న బందీలను చూసి కళ్ళెర్రచేసి, "ఒరే, పాషండుల్లారా! బాణం కొట్టి వృకేశ్వరీ భక్తుల్లో ఒకణ్ణి చంపారు. ఇక మిమ్మల్ని నా పంచశూలా నికి గుచ్చి తోడేళ్ళకు ఆహారంగా వేయ బోతున్నాను," అన్నాడు భీకరమైన కంఠ స్వరంతో.

గురుభల్లూకుడి గొంతు వింటూనే అప్పటి వరకూ సారంగద్వారం కింద ఆహారంకోసం తచ్చాడుతున్న తోడేళ్ళు పెద్దగా అరుస్తూ, ద్వారం కేసి ఎగరసాగినై. వాటికి రోజూ ఆ వేళకు ద్వారం నుంచి ఆహారం అందుతూండేది. సమయానికి అది దొరక్క పోవటంతో అవి ఆకలి భరించలేక కలిసి కట్టుగా తలలెత్తి మొరగసాగినై.

గురుభల్లూకుడు ద్వారంలోంచి బయటికి తలపెట్టి తోడేళ్ళ కేసి చూశాడు. అవి పది అడుగుల ఎత్తున్న ద్వారాన్ని ఎగిరి అందుకోగల వేమో అన్న భయం అతడికి కలిగింది. అట్లని ద్వారాన్ని మూయించితే, తాను బందీలుగా పట్టుకున్న వాళ్ళు తనను పిరికి వాడికింద జమకట్టి తీరుతారు...

జీవదత్తుడు ఎలుగ్గొడ్డు వాళ్ళ గురువు ఆలోచనలు గ్రహించిన వాడిలా తన చేతి లోని దండాన్ని పైకెత్తి, "ఒరే, గురు భల్లూకా! నువ్వు భల్లూకుడివై వుండి, ఏ భల్లూకేశ్వరినో పూజించక వృకేశ్వరి నెందుకు పూజిస్తున్నావో నాకు తెలియదు. బహుశా మందమతివై వుంటావు! ఇదిగో, నేను బండ దిగి నీ సారంగద్వారం దగ్గిరకు వస్తున్నాను," అన్నాడు.

జీవదత్తుడు అన్నంత పనీ చేస్తాడన్న భయంతో సమరబాహు అతణ్ణి వారిస్తూ,



"అయ్యా, మీరు ఆకలిగొన్న తోడేళ్ళ మధ్యగా నడిచిపోయి, ఆ గురుభల్లూకుణ్ణి చేరాలని చూస్తున్నారా? అది చాలా ప్రమాదం. గురుభల్లూకుడు మంత్రతంత్ర విద్యల్లో ఆరితేరిన ఘటం!" అన్నాడు.

ఖడ్గవర్మ తన చేతిలో వున్న ఖడ్గాన్ని పైకెత్తి పట్టుకుని, "సమరబాహూ, ఈ ఖడ్గంలోనూ, జీవదత్తుడి చేతిలో వున్న దండంలోనూ వున్న మంత్రశక్తులు తిరుగులేనివి! అందువల్ల, గురుభల్లూకుణ్ణి చూసి భయపడకు," అన్నాడు.

ఖడ్గవర్మ మాట ముగించే లోపలే వాళ్లెక్కి వున్న బండ కింద పెద్దగా ధ్వని అయింది. అది వింటూనే జీవదత్తుడు తన



పక్కన వున్నవాళ్ళను హెచ్చరిస్తూ, "జాగ్రత్త! ఆ గురుభల్లూకుడు బండ కింద వున్న దారి వెంట కొందరు శిష్యుల్ని పంపి మనను హతమార్చాలని చూస్తున్నట్టున్నది!" అన్నాడు.

ఆ హెచ్చరిక వింటూనే సమరబాహూ, అతడి అనుచరుడూ ఈటెలు పైకెత్తి బండ కింది కంత కేసి చూడసాగారు. సారంగ ద్వారం దగ్గిరవున్న గురుభల్లూకుడు అది చూసి పక్కనవున్న శిష్యుల్లో ఒకణ్ణి గట్టిగా కొప్పడుతూ, "ఒరే, చవట వెధవా! మన వాళ్ళను నిశ్శబ్దంగా పోయి, బండ కింది నుంచి హఠాత్తుగా ఆ దుర్మార్గుల మీద దాడిచేయమని చెపితే, వాళ్ళు ఏదో రణగొణధ్వని చేసి రహస్యం కాస్తా బయట పెట్టేశారు. ఇప్పుడేం దారి? ఈ బందీలు మామూలు వాళ్ళలా లేరు. ఆయుధాలతో వాళ్ళను ఆ తోడేళ్ళ బండ ఎక్కించటం, కొరివితో తలగోక్కోవటంలా అయి వూరుకున్నది." అన్నాడు.

గురుభల్లూకిడి ఎత్తుగడ ఏమిటో అర్థం చేసుకున్న జీవదత్తుడు, ఖడ్గవర్మతో, "ఖడ్గా, ఇప్పుడు నువ్వు గురుభల్లూకుడి మీద బాణ ప్రయోగం చేయటం వృథా. నువ్వు విల్లంబులెత్తగానే వాడు సారంగ ద్వారం నుంచి పక్కకు తప్పుకుంటాడు." అన్నాడు.

"అది నిజమే. కాని, ఈ సమరబాహుణ్ణి రక్షించి స్వర్ణాచారి దగ్గరకు చేర్చటం ఎలా?" అని అడిగాడు ఖడ్గవర్మ.

జీవదత్తుడు కొద్దిసేపు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత, "ఖడ్గా, అందుకు ఒకే ఒక ఉపాయం కనబడుతున్నది. మనం పద్మపురంరాజును అరణ్యంలో సింహాలను వేటాడుతూ పరిచయం చేసుకున్నామే— అదే పద్ధతిలో యీ తోడేళ్ళను వేటాడి, భల్లూకుడి బిలదుర్గాన్ని అల్లకల్లోల పరచాలి," అన్నాడు.

"ఊఁ, అలాగే చేద్దాం. ఇంకా ఆలశ్యం ఎందుకు?" అన్నాడు ఖడ్గవర్మ ఉత్సాహంగా.

"ఆ చచ్చిన తోడేలును భుజం మీద వేసుకో. ముఖ్యంగా దాని మాంసం కోసం తోడేళ్ళు నీ వెంటబడతై. అంటే నువ్వు దొరికితే అవి నిన్ను తినకుండా వదులుతవని కాదు. నీ కత్తిక్కూడా చాలా పని తగులుతుంది," అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ తానంతకు ముందు చంపి బండమీదికి లాగిన తోడేలును ఎత్తి భుజం మీద వేసుకున్నాడు. జీవదత్తుడి మాటలూ, ఖడ్గవర్మ తోడేలును భుజంమీద వేసుకోవటం — ఇవేవీ అర్థంకాక, సమరబాహు, "అయ్యా, ఏమిటి మీరు చేయబోతున్నది?" అని అడిగాడు భయపడిపోతూ.

"సమరబాహూ, మనకొచ్చిన ప్రమాదం ఏమీలేదు. నువ్వూ, నీ అనుచరుడూ కింది నుంచి బండ మీదికి ఎలుగ్గొడ్డు వాళ్ళెవరైనా రా ప్రయత్నిస్తే, వాళ్ళను ఈటెలతో పొడవండి. మేం ఇద్దరం తోడేళ్ళ మధ్యకు దిగి, వాటిని సాధ్యమైతే గురుభల్లూకుడి బిలదుర్గంలో జొరపడేలా చేస్తాం," అన్నాడు జీవదత్తుడు.

"అయ్యలారా, ఇది చాలా దుస్సాహసం!" అన్నాడు సమరబాహు.

"ఇది సాహస మవుతుందేమో కాని, దుస్సాహసం ఎంతమాత్రం కాదు, సమరబాహూ! త్వరలో నువ్వే చూస్తావు గదా." అంటూ జీవదత్తుడు నవ్వాడు.




"జీవా! మాటలతో కాలయాపన అయిపోతున్నది. ఈ తోడేలు శవాన్ని ఎంతసేపని మోసేది?" అన్నాడు ఖడ్గవర్మ.

"మనం బండమీది నుంచి కిందికి దూకబోతున్నాం. నువ్వు బండ చుట్టూ పరిగెత్తుతూ సాధ్యమైనన్ని ఎక్కువ తోడేళ్ళను నీ వెంట పడేలా ఆకర్షించు. నీ వెన్నుకాచి నేనూ పరిగెత్తుతూంటాను. తరవాత......"

జీవదత్తుడు మాట ముగించే లోపలే ఖడ్గవర్మ, "ఒరే, గురుభల్లూకా, వస్తున్నాం! నువ్వూ, నీ వృకేశ్వరీదేవీ ప్రాణాలు నిలుపుకోవాలంటే బిలదుర్గం వదిలి పారిపొండి!" అంటూ కేకపెట్టి తోడేళ్ళ బండ మీంచి



కిందికి దూకాడు. అతడి వెనగ్గా జీవదత్తుడు కూడా దూకాడు.

ఇద్దరు మనుషులు, చచ్చిన తోడేలును భుజాన వేసుకుని తమ మధ్యకు దూకి రావటం చూస్తూనే ఆకలి మీద వున్న తోడేళ్ళు ఒక్క సారిగా గొంతులెత్తి అరిచి, ఖడ్గజీవదత్తుల కేసి గుంపుగా పరిగెత్తినై. ఖడ్గవర్మ వాటికి అందకుండా ముందు వేగంగా పరిగెత్తుతూ, బండచుట్టూ తిరగ సాగాడు. వెనక జీవదత్తుడు అందిన తోడేళ్ళను తన చేతగల మంత్రదండంతో ఎత్తి విసిరి వేస్తూ, తానూ పరిగెత్తసాగాడు. అతడికి తప్పనిసరైతే తప్ప, లేకపోతే తోడేళ్ళను చంపాలని లేదు......



సారంగ ద్వారం దగ్గిర నిలబడి యిదంతా చూస్తున్న గురుభల్లూకుడు పట్ట లేని ఉత్సాహంతో పెద్దగా చప్పట్లు చరిచి, "అంతా ఆ వృకేశ్వరీదేవి మాహాత్మ్యం! తన శత్రువులకు మతులు పోగొట్టి, పిచ్చెత్తించి, తన వాహనాలైన తోడేళ్ళకు ఆహారంగా వేస్తున్నది. ఆహా, ఆ మహాతల్లి తలుచుకుంటే చేయులేని దేమున్నది!" అంటూ భక్తి పారవశ్యంలో కళ్ళుమూసుకుని, తలపైకెత్తాడు.

అప్పటి వరకూ తోడేళ్ళను వెంట వేసుకుని వాటికి అందకుండా ఖండచుట్టూ, సారంగం పక్కనా గిరికీలు తిరుగుతున్న ఖడ్గజీవదత్తులకు గురుభల్లూకుడి వాలకం మంచి అవకాశంలా కనిపించింది. జీవదత్తుడు, "ఖడ్గా, యిదే మంచి సమయం! ఆ భల్లూకుడు భక్తి మైకంలో వున్నాడు!" అంటూ ఖడ్గవర్మను హెచ్చరించాడు.

ఖడ్గవర్మ మరుక్షణం తన భుజం మీద వున్న చచ్చిన తోడేలును ఎడం చేత్తో పైకెత్తి, దాన్ని గురుభల్లూకుడున్న సారంగ ద్వారంలోకి విసిరివేశాడు. తమ ఆహారం అలా ద్వారం కేసి పోవటం చూస్తూనే, బాగా ఆ ఆకలిగొన్న నాలుగైదు తోడేళ్ళు దానితో పాటు పైకెగిరి ద్వారంలోకి దూకినై. కళ్ళు మూసుకుని ధ్యానంలో వున్న గురుభల్లూకుడి మీద చచ్చిన తోడేలూ, దాని మాంసం

తినేందుకు బతికివున్న నాలుగైదు తోడేళ్లూ ఒకేసారి వచ్చిపడినై.

"హాఁ, వృకేశ్వరీ!" అంటూ గురుభల్లూకుడు తోడేళ్ళ తాకిడికి కింద పడి లేచే లోపల, వెంటవున్న వాడి శిష్యులు, "తోడేళ్ళు! తోడేళ్ళు!" అంటూ సొరంగ మార్గం వెంట పడి, బిలం మధ్యకు పరిగెత్త సాగారు.

గురుభల్లూకుడు గజగజ వణికిపోతూ లేచి నిలబడ్డాడు. అల్లంత దూరంలో పడివున్న చచ్చిన తోడేలు మీదికి కొన్ని తోడేళ్ళు వచ్చిపడి ఆవురావురు మంటూ తింటున్నవి. వాటి మధ్యకుపోయి తానూ తినాలని చూసి సాధ్యంకాక యివతలికి వచ్చిన ఒక్క తోడే లొకటి కోరలుచాచి గుర్రుమంటూ గురుభల్లూకుడి మీదికి దూకేందుకు సిద్ధపడుతున్నది. అది చూసిన భల్లూకుడు తన చేతిలోని శూలాన్ని పైకెత్తి, దానికి గురిచేసి, "వృకేశ్వరి ప్రధాన భక్తుణ్ణే తినాలని చూస్తున్నావా?" అంటూ దాన్ని అదిలించి, ఒక్కొక్క అడుగే వెనక్కు వేస్తూపోయి, సొరంగ మార్గానపడి పరిగెత్త సాగాడు.

ద్వారం దిగువ యివతల మిగిలిన తోడేళ్ళను దూరంగా అదిలించి కొడుతూ నిలబడివున్న ఖడ్గజీవదత్తులకు లోపల ఏం జరుగుతున్నదో అర్థం కాలేదు. గురుభల్లూకుణ్ణి ఏదైనా తోడేలు మీదపడి పట్టుకుని గొంతు కొరికి చంపిందో లేదో వాళ్ళకు తెలియలేదు.



"ఖడ్గా, ఇక మనం యిక్కడ నిలబడి లాభం లేదు. గురుభల్లూకుడు బతికి వున్నాడో చచ్చాడో తెలియటం లేదుగాని, సొరంగంలో ప్రవేశించిన తోడేళ్ళు మాత్రం ఆ దుర్మార్గు లందర్నీ హడల గొట్టినై. బిలంలో చెలరేగిన కల్లోలపు ధ్వనులు నీకు వినబడు తున్నవిగదా?" అన్నాడు జీవ దత్తుడు.

"వినబడక పోవటం ఏం? ఆ పిరికి వెధవలంతా బిలం వదిలి యీ సరికే అరణ్యం కేసి పరిగెత్తుతున్నారని నా అను మానం. గురుభల్లూకుణ్ణి మాత్రం ప్రాణా లతో వదలకూడదు," అన్నాడు ఖడ్గవర్మ.

"అయితే, యిక్కడ కాలయాపన ఎందుకు? అందరం యీ సొరంగ ద్వారం కుండా బిలంలోకి జొరబడదాం. సమర బాహుణ్ణీ, అతడి అనుచరుణ్ణీ కేకవేసి, యిక్కడికి రమ్మను," అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ పిలవగానే, సమరబాహూ, అతడి అనుచరుడూ తోడేళ్ళ బండ మీది నుంచి దిగి వాళ్ళ దగ్గిరకు వచ్చారు. జీవదత్తుడు వాళ్ళతో, "సమరబాహూ! మనం యీ పైనున్న ద్వారంకుండా బిలంలో ప్రవేశించ బోతున్నాం," అన్నాడు.

సమరబాహు చుట్టూ ఓ మారు కలయ చూసి, భయం భయంగా, "మనం కొద్ది మందిమి బిలంలోవున్న అంతమంది శత్రు వుల్ని జయించ గలమా? ఇటునుంచి పారి పోయి అరణ్యం చేరేందుకు మరెక్కడైనా మార్గం వున్నదేమో చూస్తే బావుంటుంది," అన్నాడు.

"ఇది తోడేళ్ళ బండ! బయటకు చేర టానికి బిలంలో నుంచి మాత్రమే దారి వున్నది!" అంటూ జీవదత్తుడు ఎగిరి సొరంగ ద్వారం మీది కెక్కాడు. అతడి వెనగ్గా ఖడ్గవర్మ కూడా అక్కడికి చేరాడు.

ఇంకా తెగని సంశయంతో ఏమి చేయ టమా అని ఆలోచిస్తూ కింద నిలబడి వున్న సమరబాహుణ్ణీ, అతడి అనుచరుణ్ణీ మీద పడి తినేందుకు, అక్కడ యింకా మిగిలి వున్న తోడేళ్ళు ఒక టొకటిగా వాళ్ళ దగ్గి రకు రాసాగినై. —(ఇంకావుంది)





# ధర్మసంస్థాపన

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ధర్మాధర్మాలు విచారించే ఈ పనికి పూనుకున్నావా? ధర్మం నిలబెట్టటం మాటలు కాదు. అందుకు నిదర్శనంగా నీకు గండడు అనే చోరశిఖామణి వృత్తాంతం చెబుతాను, శ్రమ తెలియకుండా విను." అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం వసంతనగరాన్ని మదనవర్మ అనే రాజు పాలించేవాడు. అతడు సుఖలోలుడు. ఎప్పుడూ తాగుతూ, ఆడవాళ్ళను చుట్టూ ఉంచుకుని ఆనందిస్తూ, రాజ్యపాలన గురించి పట్టించుకునేవాడు కాదు. అందుచేత రాజ్యభారమంతా మంత్రుల మీదా, సేనాపతుల మీదా ఉండేది. వాళ్ళు

బేతాళ కథలు



తమకు గల అధికారాలను యథేచ్ఛగా దుర్వినియోగం చేసి, ప్రజలను కొల్లగొట్టేస్తూ ఉండేవారు.

అయితే, మదనవర్మ మహాధర్మాత్ముడని పై దేశాలలో పెద్ద ఖ్యాతి ఉండేది. దానికి కారణం ఏమంటే, ఆయన ఏడాదికి రెండు సార్లు గొప్పగా యజ్ఞాలు చేసేవాడు; బ్రాహ్మణులకు సంతర్పణలు చేసి, ఘనంగా సంభావన లిచ్చి, వారి పొగడ్తలూ, ఆశీర్వాదాలూ పొందేవాడు. ఈ యజ్ఞాలకు అంతులేని డబ్బూ, వస్తుసామగ్రీ అవసరం అయేది. ప్రభుత్వోద్యోగులు దేశంలోని గ్రామాలన్నిటినీ ఊడ్చి, వాటిని సేకరించేవారు. యజ్ఞం పూర్తి కాగానే దేశమంతటా దారిద్ర్యం విలయతాండవం చేసేది; ప్రజలు భయంకరమైన కష్టాలకు గురిఅయేవారు.

రాను రాను ప్రజల జీవితం భీభత్సంగా తయారయింది. ఈ పరిస్థితిలో గండడు అనే గజదొంగ ఒకడు వెలిశాడు. వాడు వ్యాపారస్థులకూ, బాటసార్లకూ సింహస్వప్నంగా తయారయాడు.

ఆ సంవత్సరం కూడా రాజుగారు యథావిధిగా యజ్ఞం జరిపించి, బ్రాహ్మణులకూ, సన్యాసులకూ సంభావన లిచ్చి సత్కరించాడు. రామశర్మ అనే బ్రాహ్మణుడు కూడా రాజుగారి సత్కారాన్ని అందుకుని, రాజుగారిచ్చిన బంగారు కాసులు మూట గట్టుకుని, అరణ్యమార్గాన తన ఊరికి ప్రయాణమయాడు.

రామశర్మ ధైర్యం తెచ్చుకునేటందుకు ఏవేవో నీతి శ్లోకాలు గట్టిగా చదువుతూ అరణ్యమార్గాన పోతూండగా, గండడు తన ముఠాతో సహా అతన్ని చుట్టుముట్టి, "ప్రజలంతా చెమటోడ్చి సంపాదించిన ధాన్యాన్నీ, సంపదనూ కొల్లగొట్టి యజ్ఞాలు చేస్తున్నారు! ఒక వైపు ప్రజలు రాజోద్యోగుల పీడతో చస్తున్నారు. వాళ్ళే యజ్ఞపశువులు! ఇలాటి యజ్ఞాలతో పాపం పోతుందా? నీ బోటి వాళ్ళంతా ఈ పాపిష్టికూడు తిని, రాక్షసుడు లాటి రాజును ధర్మాత్ముడని పొగడి, నాలుగు కాలాలపాటు వర్థిల్లమని దీవించి,

ఈ అధర్మాన్ని కొనసాగిస్తున్నారు. ఆ కానుల మూట అక్కడ పెట్టి, కదులు. నువు బీద బ్రాహ్మడివి గనక ప్రాణాలతో వదిలేస్తున్నాను,'' అన్నాడు.

రామశర్మ ప్రాణాలు బిగబట్టుకుని, ''అయ్యా, దొంగల నాయకుడుగారూ! మీ రన్నదంతా నిజమే. ఒప్పుకుంటాను. కాని మీరు చేసేది ధర్మమేనా కాస్త ఆలోచించండి,'' అన్నాడు.

''నేను అధర్మాన్ని ఎదిరిస్తున్నాను. అందుచేత నేను చేసేది ధర్మమే. ఈ రాజు అసమర్థుడు, కంటకుడు. వాడి ఉద్యోగులు రాక్షసులు. దోచుకోవటంలో నాకు విచక్షణ ఉన్నది; ఆ రాజుకు మాత్రం లేదు,'' అన్నాడు గంతడు.

''అయితే, మీరే ధర్మం ఎందుకు స్థాపించకూడదు? జనానికి రక్షణా శాంతీ ఎందుకు ప్రసాదించకూడదు?'' అని రామశర్మ గంతడిని అడిగాడు.

''అందుకు దేశం నా చేతుల్లో ఉండాలి గద. అంటే నేను రాజు కావాలి అది ఎలా సంభవం?'' అన్నాడు గంతడు.

వాణ్ణి ఉబ్బ వెయ్యటానికి రామశర్మ, ''ఎందుకు సంభవం కాదు? ప్రయత్నించాలి. అంతే! ఎందరు దొంగలనాయకులు మహారాజులూ చక్రవర్తులూ కాలేదు?'' అన్నాడు.

గంతడు ఆలోచనలో పడ్డాడు. వాడికి ఈ ఆలోచన మునుపు ఎన్నడూ రాలేదు. ఆలోచించగా, రాజు కావటం ఏమంత





అసంభవంగా తోచలేదు వాడికి. రామశర్మ ఎత్తు పారింది.

"నాకు మంచి సలహా ఇచ్చావు. ప్రయత్నించి తీరుతాను. రాజ్యంలో ధర్మం స్థాపించుతాను. నువు బీదవాడివి. నీ ధనం తీసుకోను. వెళ్ళిపో." అన్నాడు గండడు రామశర్మతో.

రామశర్మ, బతుకు జీవుడా అనుకుని, తన దారిన తాను పోయాడు.

గండడు మంచి ఆలోచనాపరుడు. తాను రాజు కావటానికి తగిన పథకం వాడు ఆ రోజే తయారు చేసుకున్నాడు. రాజ్యమంతటా గల దొంగల ముఠాలన్నిటినీ నయానో, భయానో తన నాయకత్వం కిందికి తెచ్చుకున్నాడు. దొంగలకు నిరాయుధులను నరకటమూ, బెదిరించటమూ తప్ప యుద్ధవిద్యలు రావు. తన నాయకత్వం కిందికి వచ్చిన దొంగలందరికీ వాడు సైనిక శిక్షణ ఇప్పించాడు.

చీటికిమాటికి బందిపోటులలాగా వచ్చిపడి, కొల్లగొట్టుకుపోయే రాజోద్యోగులను అరికట్టుతాననీ, ప్రజల జీవితాన్ని కాపాడుతాననీ మాట ఇచ్చి, ప్రజలు న్యాయంగా రాజుకు కట్టే పన్నులు తనకే కట్టే పద్ధతి మీద గండడు రాజ్యంలోని అనేక గ్రామాలను తన అధీనంలోకి తెచ్చుకున్నాడు. వాడు ఆ గ్రామాలకు తాను ఇచ్చిన వాగ్దానాలు నిలబెట్టుకుని, అక్కడ రాజుగారి పరిపాలన లేకుండా చేశాడు.

గండడు కూడా ఇప్పుడొక చిన్న రాజు. అరణ్య మధ్యంలో వాడి కొక కోట కూడా వెలిసింది. తన రాజ్యంలోనే మరొక రాజు అవతరించటం చూసి మదనవర్మ దిగ్భ్రమ చెందాడు. వాడు అంతగా పెరిగేదాకా తన కింది అధికారులు ఎందుకు చూస్తూ ఊరుకున్నారో ఆయనకు అర్థం కాలేదు. ఆయన వాళ్ళను చెడా మడా తిట్టి, తన సైన్యాన్ని అరణ్యంలోకి స్వయంగా నడిపించుకు వెళ్ళి, గండడి కోటకు ముట్టడివేశాడు.

అరణ్యమే మదనవర్మను నాశనం చేసింది. అరణ్యంలో యుద్ధరంగం ఏర్ప

డదు. చెట్ల చాటు నుంచీ, చెట్ల మీది నుంచీ రాత్రివేళ గండడి భటులు బాణాలూ, అగ్ని బాణాలూ వేసి, రాజుండే శిబిరాన్ని తగలబెట్టేశారు. అనేకమంది సైనికులు చచ్చారు. రాజూ, అతని వెంట ఉన్న ముఖ్య సైనికాధికారులూ శిబిరంతో సహా బూడిద అయిపోయారు.

మర్నాడే గండడు రాజలాంఛనలతో, తన సైన్యాన్ని వెంట బెట్టుకుని రాజధానికి వెళ్ళాడు; మదనవర్మ కొడుకును రాజభవనంలోనే నిర్బంధంలో ఉంచి, తన పట్టాభిషేకానికి ఉత్తరువిచ్చాడు.

"గండడిది ఏ వర్ణం? క్షత్రియుడు కాని వాడికి రాజ్యార్హత లేదు గదా?" అని కొందరు ధర్మసందేహం వెలిబుచ్చారు.

అది విని రాజపురోహితుడు, "వీరగండేశ్వరమహారాజులుంగారు అత్యుత్తమ క్షత్రియులు. వారిది సూర్యవంశం. శ్రీరామచంద్రుల వారికి వీరు నూటఎనిమిదో తరం వారు. వారి వంశవృక్షం అదివరకే నా వద్ద ఉన్నది," అంటూ తాను తయారు చేసిన జాబితా చదివి సభికులకు వినిపించాడు.

అది విని గండడు, తాను నిజంగా సుక్షత్రియుణ్ణేనని నమ్మాడు. వాడికి రాజపురోహితుడిలో విశ్వాసం ఏర్పడింది. పట్టాభిషేకం తంతు ఎలా జరగాలో అయన చెబుతుంటే గండడికి అదంతా తనకు పరిచయమైనదిలాగే అనిపించింది.

గండడు తన చుట్టూ చేరిన పరివారం ఇచ్చే సలహాలను అనుసరించి, రాజోచితంగా





జీవిస్తూ, సేనాపతుల సలహాలను అనుసరించి, పరిసర రాజ్యాలతో యుద్ధాలు చేసి రాజ్యాన్ని బాగా విస్తరింపజేశాడు.

ఇంతలో యజ్ఞం చేసే తరుణం వచ్చింది.

"మహారాజా, ఈయేడు తాము కంకణం కట్టుకుని, పూర్వం ఎన్నడూ జరగనంత గొప్ప యజ్ఞం చెయ్యాలి," అని రాజపురోహితుడు గండడితో అన్నాడు. అది గండడికి సముచితంగానే కనబడింది

రాజోద్యోగులు దేశం మీద పడి యజ్ఞ సంబారాలూ, ధనమూ, బంగారమూ కొల్లగొట్టుకు వచ్చారు. భారీఎత్తున బ్రాహ్మణ సంతర్పణలు జరిగాయి. గండడు బ్రాహ్మణులకు సంభావనలిచ్చి, ఆశీర్వాదాలు పొందుతున్నాడు. ఒక్కొక్కరే వాణ్ణి నాలుగు కాలాలపాటు వర్ధిల్లమని ఆశీర్వదిస్తున్నారు.

ఆ బ్రాహ్మల వరసలో రామశర్మ కూడా ఉన్నాడు. అతని మొహం గండడికి ఎక్కడో చూసిన మొహంలా తోచింది. రామశర్మ మరింత హెచ్చు సంభావన పొందాలన్న ఆశతో, "మహాప్రభూ, నేను తమకు గుర్తున్నానా? తమరు అన్నమాట నిలబెట్టుకుని, ధర్మాన్ని నిలబెట్టి ఆదర్శప్రభువులయారు. మీరు పదికాలాలపాటు వర్థిల్లాలి. మేము తమ నీడన చల్లగా ఉండాలి," అన్నాడు.

గండడి మొహం మాడిపోయింది. అతను పరధ్యానంగా సంభావన లివ్వటం పూర్తి చేసి, అంతఃపురానికి వెళ్ళిపోయాడు. ఆ రాత్రే అతను మదనవర్మ కొడుకును చెరవిడిపించి, అతనికి పట్టాభిషేకం జరిపించమని మంత్రితో రహస్యంగా చెప్పి, ఆ రాత్రికి రాత్రే గుర్రం ఎక్కి, ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయాడు.

మహారాజుగారు లౌకిక విషయాలతో విరక్తి చెంది, ఆధ్యాత్మిక చింతన కోసం అరణ్యాలకు వెళ్ళిపోయారని మంత్రి మర్నాడు ప్రకటించి, మదనవర్మ కొడుకును రాజుగా సింహాసనం ఎక్కించాడు.

తిరిగి అరణ్యంలో ఒక గజదొంగ వెలిశాడనీ, వాడు చాలా దయగలవాడనీ, ధనవంతులను దోచి పేదలకు పంచిపెట్టు

తున్నాడనీ పుకార్లు బయలుదేరాయి. ఆ దొంగ సింహాసనాన్ని త్యాగం చేసి వెళ్ళిన గండడే నని కూడా అందరికీ తెలిసింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, గండడు తాను రాజై ధర్మాన్ని నిలబెట్టాలను కున్న వాడు రాజు అయి కూడా ఆ పని చెయ్యక, తిరిగి దొంగగా ఎందుకు మారాడు? యజ్ఞాలను తిట్టినవాడు రాజై తానే ఎందుకు యజ్ఞం చేశాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అధర్మాన్ని కొనసాగించటం శక్తిగల వాడికి చాలా తేలిక. అందుకు ప్రజలసహకారం అవసరం లేదు. ధర్మాన్ని నిలబెట్టటం చాలా కష్టం. అందుకు అన్ని తరగతుల వారి తోడ్పాటూ కావాలి. అధర్మాన్ని ఎదిరించటం మాత్రమే తెలిసిన గండడు, తాను రాజు అయినంత మాత్రానే ధర్మసంస్థాపన చెయ్యగల నను కున్నాడు. కాని తాను తీరా రాజు అయాక రాజు అనేవాడు పూర్తిగా స్వతంత్రుడు కాదనీ, రాజధర్మాలను నిర్ణయించే శక్తులు చాలా ఉన్నాయనీ, వాటికి ఎదురు తిరిగి తనేగాని రాజు కూడా ఏమీ చేయలేడనీ వాడికి తెలిసి వచ్చింది. అలాటి తిరుగుబాటు రాజుగా పుట్టి పెరిగిన వాడికి సాధ్యం కావచ్చుగాని, దారులు కొట్టేవాడికి సాధ్యం కాదు. రాజుగా ఉండి చేతులూ కాళ్ళూ కట్టేసుకోవటం కన్న దొంగగా ఉండి అధర్మాన్ని ఎదిరించటమే తనకు సాధ్యమనితోచి వాడు తిరిగి దొంగ అయాడు. తాను రాజుగా ఉండి కొన్ని కొత్త రాజ్యాలు కూడా జయించిన మీదట యజ్ఞం చెయ్యటం తన విధి అని వాణ్ణి అందరూ కలిసి నమ్మించారు. ఆ యజ్ఞం చెయ్యకుండా ఉండేపాటి తిరుగుబాటు కూడా వాడికి లేకపోయింది. దానిద్వారా రాజు ఎంత అస్వతంత్రుడో తెలిసి వచ్చింది. వాడు చివరకు తన స్వాతంత్ర్యమే చూసుకున్నాడు." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# ప రీ క్ష

కావేరీతీరాన శంకరభట్టు అనే పండితుడు విద్యార్థులకు భోజనం పెట్టి విద్యాదానం చేస్తూ ఉండేవాడు. ఆయన వద్ద అనేకమంది శిష్యులు వేదశాస్త్రవిద్యలు నేర్చుకుని వెళుతూ ఉండే వారు.

జగన్నాథు డనే శిష్యుడు కొంతకాలం చాలా శ్రద్ధగా చదువుకున్నాడు. వాడికి చదువు మీద శ్రద్ధ తగ్గుతున్నదని శంకరభట్టుకు అనుమానం కలిగింది. ఆ విషయం ఆయన తన భార్యతో అన్నాడు.

"వాడికి చదువు మీద శ్రద్ధ నిజంగా పోయినప్పుడు నేను చెబుతాను," అని భార్య అన్నది.

ఒకనాడు ఆవిడ జగన్నాథుడికి ఎప్పటిలాగే భోజనం వడ్డించి, అన్నం మీద ఆముదం వేసింది. జగన్నాథుడు అన్నం కలుపుకుని ముద్ద నోటపెట్టుకుని, "అమ్మా, ఆముదం వేశారా?" అని అడిగాడు.

"అవును, నాయనా. నేను ఇన్ని ఏళ్ళూ నీకు అన్నం మీద ఆముదమే వేస్తున్నాను. కాని చదువు మీది శ్రద్ధలో నువ్వు అది గమనించనే లేదు. నీ చదువు పూర్తి అయింది. అందుచేత ఇప్పుడు గమనించావు," అన్నది శంకరభట్టు భార్య.

ఆ రోజే శంకరభట్టు జగన్నాథుణ్ణి ఇంటికి సాగనంపాడు.

—భైరి సత్యనారాయణ





# బాకీ వసూలు

ఒక ఊళ్ళో ధర్మయ్య అనే ధనికుడు ఉండే వాడు. ఆయన ధర్మబుద్ధి కల వాడు; ఊళ్ళో చాలా మందికి ఆయన అవసరానికి స్వల్ప వడ్డీల మీద అప్పులిచ్చి ఆదుకుంటూ ఉండేవాడు. అప్పులు వసూలు చేయడంలో కూడా ఆయన ఎంతో తెలివైన వాడు.

బాకీ వసూలు చేసుకోవడానికి ధర్మయ్యకు అనేక పద్ధతులు ఉండేవి. అభిమాన వంతుడైన సోమశర్మ అనే బ్రాహ్మణుడు ఒక సారి ధర్మయ్య వద్ద యాభై వరహాలు అప్పు తీసుకుంటూ, "మీరు పత్రమూ, సాక్ష్యమూ లేకుండా నాకు అప్పు ఇస్తున్నారు గదా, నేను ఎగవేస్తే ఏం చేస్తారు ?" అని అడిగాడు.

అందుకు ధర్మయ్య నవ్వి, "మీ వంటి వారికి పత్రమూ, సాక్ష్యమూ ఎందు కండీ? అన్న రోజుకు మీరు తప్పకుండా నా బాకీ చెల్లు వేస్తారని నాకు నమ్మకముంది. ఒక వేళ ఎగవేస్తే, ముష్టివాడికి దానం చేశానను కుంటాను. యాభై వరహాలు పోయినంత మాత్రాన నాకు పెద్ద నష్టం లేదు," అన్నాడు.

అభిమానం గల సోమశర్మ ధర్మయ్య పెట్టిన గడువు రోజుకు డబ్బు తెచ్చి, బాకీ తీర్చేశాడు.

ధర్మయ్యకు పొరుగున సుబ్బయ్య అనే తెలివిలేని ధనికుడు ఉన్నాడు. సుబ్బయ్యకు ధనాశ మెండు. వడ్డీ వ్యాపారం చేస్తే బాగా సంపాదించ వచ్చునని ఆయనకు తెలుసును. కాని బాకీలు వసూలు చేసుకునే చాకచక్యం ఆయనకు లేదు. ధర్మయ్య దగ్గిర ఆ విద్య నేర్చుకోవాలని ఉండేది ఆయనకు. కాని ధర్మయ్య తనకా రహస్యం చెబుతాడని ఆయనకు నమ్మకం లేదు. అది వ్యాపార రహస్యం గద!

"వసుంధర"



కొంత కాలం పోయాక సుబ్బయ్యకు ఒక ఆలోచన వచ్చింది. ధర్మయ్య బాకీ వసూలు చేసుకునే పద్ధతి తెలుసు కోవాలంటే, తానే ఆయన దగ్గిర బాకీ చెయ్యాలి! ఇంత చిన్న ఆలోచన తనకు ఇంత కాలమూ తట్టనందుకు సుబ్బయ్య ఎంతో విచారించి, ఆ రోజే ధర్మయ్య వద్దకు వెళ్ళి, వంద వరహాలు అప్పుగా అడిగాడు.

ధర్మయ్య ఆశ్చర్యపోతూ, "నేను మీకు అప్పివ్వడమా?" అన్నాడు.

"సమయానికి చేతిలో రొక్కం లేని సమయంలో అనుకోకుండా ఈ ఖర్చు నా నెత్తి మీద పడింది. మీరు తప్ప మరెవరూ ఈ సమయంలో ఆదుకునే వాళ్ళు లేరు. పై నెలలో మీ సొమ్ము మీకు తిరిగి ఇచ్చేస్తాను," అన్నాడు సుబ్బయ్య.

ధర్మయ్య ఒక్క క్షణం ఆలోచించి, "సరే, అలాగే ఇస్తాను," అని లోపలికి వెళ్ళి, నూరు వరహాల రొక్కంతో పాటు ఒక రాయి కూడా తెచ్చి, "ఒక్క సారి దీన్ని తాకండి," అన్నాడు.

సుబ్బయ్య ఆశ్చర్యపోతూ, "ఎందుకు?" అన్నాడు.

"ఊరికేనే! మరేంలేదు," అన్నాడు ధర్మయ్య నవ్వుతూ.

సుబ్బయ్య ఆ రాయిని తాకి వంద వరహాలు తీసుకుంటూండగా, "వడ్డీ నెలకు రెండు వరహాలవుతుంది," అని ధర్మయ్య అన్నాడు.

తనకు హెచ్చు వడ్డీ చెబుతున్న సంగతి సుబ్బయ్య గ్రహించాడు. అయినా తన ఉద్దేశం ధర్మయ్య వ్యాపార రహస్యం తెలుసుకోవటం గనక ఆయన మాట్లాడకుండా ఆ డబ్బు తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

నెలలు గడిచినా వారిద్దరి మధ్యా ఆ డబ్బు ప్రసక్తి రాలేదు.

సుబ్బయ్య ఓపికగా అయిదు నెలలు చూశాడు, ధర్మయ్య బాకీ గురించి అడుగుతాడేమోనని. కాని అలా జరగక పోయే సరికి ధర్మయ్య ఆ బాకీ మాట మరచి

పోయా డనిపించింది సుబ్బయ్యకు. ఇంక ఆగలేక తానే ధర్మయ్య దగ్గిరికి స్వయంగా వెళ్ళి, "ఇంతకాలమైనా, మళ్ళీ నన్ను బాకీ గురించి అడగనే లేదు, మరిచి పోయారా?" అని అడిగాడు.

"నేనెందుకు మరిచిపోతాను? ఆలస్య మైన కొద్దీ నాకే లాభం కదా! మీరు తీసు కున్న డబ్బు నుంచి వడ్డీ ఎక్కువ వస్తుంది," అన్నాడు ధర్మయ్య.

"ఒక వేళ నేను బాకీ ఎగవేస్తేనో?" అన్నాడు సుబ్బయ్య.

"అలా చేయలేరు. డబ్బు తీసుకునే టప్పుడు నా దగ్గిర ఉన్న రాయిని ముట్టు కున్నారు గదా! అది మహిమగల రాయి. దాన్ని ముట్టుకున్న వాడెవడూ నా దగ్గిర బాకీ ఎగవేయ లేడు," అన్నాడు ధర్మయ్య.

ఆ రహస్యం తెలియగానే సుబ్బయ్య, "అదా సంగతి!" అనుకుని, క్షణంపాటు తీవ్రంగా ఆలోచించి, "అయ్యా, ధర్మయ్య గారూ! కొన్ని బాకీలు వసూలు కాక నా నా యిబ్బందీ పడుతున్నాను. దయవుంచి మీ రాయిని కొంతకాలం నా దగ్గిర ఉంచితే, నా బాకీలు వసూలు చేసుకుని మళ్ళా మీకు ఇచ్చేస్తాను," అన్నాడు.

"దానికే ముందీ? నా దగ్గిర రెండు రాళ్ళున్నాయి. ఒకటి మీకు అమ్ముతాను. ఒక ఏడాది పాటు మీ దగ్గిర ఉంచుకోండి.



పని చెయ్యకపోతే మీకు డబ్బు తిరిగి ఇచ్చేసి, నా రాయి నేను తీసుకుంటాను," అన్నాడు ధర్మయ్య.

సుబ్బయ్య పరమానందంతో, "రాయి ఖరీ దెంత?" అని అడిగాడు. ఆ రాయి కొనటం వల్ల తన కేమీ నష్టం ఉండదని తెలుస్తూనే ఉన్నదాయనకు.

"నూట పది వరహాలు," అన్నాడు ధర్మయ్య.

సుబ్బయ్య చప్పున ఇంటికి వెళ్ళి, ఒక సంచీతో తిరిగి వచ్చాడు. ఆయన ముఖం దీనంగా ఉన్నది. ఆయన ధర్మయ్యతో, "ధర్మయ్యగారూ, ఇంట్లో రొక్కం అను కున్నంత లేదు. నూటపది వరహాలు

తెచ్చాను. ఇది తీసుకుని ప్రస్తుతానికి రాయి ఇప్పించండి. మీ బాకీ తరవాత తీరుస్తాను," అన్నాడు.

"దానికేం లెండి? ఆలస్యమైన కొద్దీ వడ్డీ కూడా పెరుగుతుంది గద!" అంటూ ధర్మయ్య డబ్బు తీసుకుని, సుబ్బయ్యకు ఆ రాయి ఇచ్చి పంపేశాడు.

రాయి తీసుకున్నాక సుబ్బయ్య ధైర్యంగా ఊళ్ళో చాలా మందినే పిలిచి మరీ హెచ్చు వడ్డీలకు అప్పు లిచ్చాడు. పత్రమూ, సాక్ష్యమూ లేకుండా సుబ్బయ్య అందరికీ అప్పులిస్తూ ఉండటం చూసి చాలా మంది, ఎంత హెచ్చు వడ్డీ అయినా లక్ష్య పెట్టకుండా అప్పు కోసం ఎగబడ్డారు. రాయి తాకిన వారందరికీ సుబ్బయ్య అప్పు లిచ్చాడు.

నెలలు గడుస్తున్నాయి. సుబ్బయ్య దగ్గిర డబ్బులు తీసుకునే వాళ్ళేగాని ఇచ్చే వాళ్ళు కనిపించలేదు. ఏడెనిమిది నెలలు చూసి, ఉండబట్టలేక సుబ్బయ్య, ధర్మయ్యను అడిగేశాడు.

పూర్తిగా ఏడాది అయేవరకూ చూడ మన్నాడు ధర్మయ్య.

ఏడాది గడిచిపోయింది. అప్పులిచ్చి సుబ్బయ్య చాలా డబ్బు పోగొట్టుకున్నాడు. ఒక్కడూ డబ్బు సరిగా తిరిగి ఇయ్యలేదు.

సుబ్బయ్య రాయి పుచ్చుకుని కోపంగా ధర్మయ్య వద్దకు వెళ్ళి, రాయిని ధర్మయ్య ముందు విసిరికొట్టి, "అంతా పచ్చిమోసం! మీ మాటలు నమ్మి బోలెడు డబ్బు నష్ట పోయాను," అన్నాడు.

"నా దగ్గిర బాగానే పని చేస్తోందే ఆ రాయి!" అన్నాడు ధర్మయ్య.

"నా మొహం పని చేసింది! ఏడాది దాటి పోయింది, నా బాకీయే మీ రింకా వసూలు చెయ్యలేదు. మీ రాళ్ళలో ఏ మహిమా లేదు," అన్నాడు సుబ్బయ్య.

"నా బాకీ వసూలు కాకపోవట మేమిటి? వడ్డీతో సహా వసూలయింది. నేనా రాయిని మీకు ఊరికేనే ఇచ్చాను. మీరిచ్చిన డబ్బు బాకీ కింద జమ వేసుకున్నాను," అన్నాడు ధర్మయ్య నవ్వుతూ.



# తాజా సరుకు

ఒక దుకాణం ముందు 'దుకాణంలో తాజా చేపలు అమ్మబడును' అనే బోర్డు కట్టి ఉంది. అందరూ చేపలు కొంటున్నారు. ఒకడు మాత్రం ఒక చేప తీసి మొదట తన నోటి దగ్గర, ఆ తర్వాత చెవి దగ్గర కొంచెం సేపు ఉంచి, తర్వాత ఆ చేపను చాప మీద పడేశాడు.

చేపలవాడు అది చూచి, "ఏమయ్యా, యిక్కడ కుళ్ళు చేపలు అమ్మరయ్యా. అయినా వాసన చూడాలంటే ముక్కు దగ్గర పెట్టి చూస్తారు గాని నోటి దగ్గర, చెవి దగ్గర పెడుతున్నా వేమిటయ్యా?" అంటూ హేళనగా నవ్వాడు.

"నేను వాసన చూడలేదయ్యా! చేపతో మాట్లాడాను," అన్నాడు కొనటానికి వచ్చినవాడు.

చేపలు కొనడానికి వచ్చిన వాళ్ళంతా అతని కేసి చూడసాగారు.

"అఁ అలాగా! అయితే చేప ఏమిటి చెప్పిందేమిటి?" అంటూ చేపలమ్మేవాడు మళ్ళీ నవ్వాడు.

"'నేను సముద్రం నుంచి వచ్చి మూడ్రోజులయింది. అంచేత నాకేమీ తాజా వార్తలు తెలియవు;' అని ఆ చేప చెప్పింది," అన్నాడు కొనటానికి వచ్చినవాడు.

అతని మాటలు విని అక్కడున్న వాళ్ళంతా నవ్వారు. చేపలమ్మేవాడు సిగ్గుపడి పోయాడు.

—కాలిపు శంకరరావు





# కనబడని దృశ్యాలు

కావేరీతీరాన నారాయణసన్యాసి అనే ముని, అయాచకుడు అనే శిష్యుడూ ఉండేవారు. వాళ్ళు ఒకసారి రామేశ్వర యాత్రకు బయలుదేరారు.

దారిలో నారాయణముని ఒక చెట్టు కింద కూర్చుని, చెంబు తీసుకుని ఎక్కడయినా నీరు ఉంటే తీసుకురమ్మని శిష్యుణ్ణి పంపాడు. అయాచకుడు నీరుకోసం వెతుకుతూ పోతూ ఉండగా, ఒక చెట్టు నీడన ఒక మనిషి కూర్చుని, తాను తెచ్చుకున్న ఆహారం మూట విప్పుతూ కనిపించాడు. అతన్ని అడిగితే నీరు దొరకవచ్చు, లేదా నీరుండే చోటు తెలియవచ్చు అనుకుని అయాచకుడు అతని కేసి నడిచాడు.

అప్పుడు ఆ మనిషి గబగబా తన ఆహారం మూట చుట్టుకుని, వేగంగా ఎటో పారిపోయాడు. తాను తెచ్చుకున్న ఆహారాన్ని మరొకడితో పంచుకోవలసి వస్తుందని భయపడి ఆ మనిషి పారిపోయి ఉంటాడని అయాచకుడు గ్రహించాడు. ఆ మనిషి పోయే గడబిడలో తన నీళ్ళ చెంబు తన్నేసి, నీరంతా నేలపాలు చేశాడు.

అయాచకుడు ఆ మనిషి ప్రవర్తనకు నవ్వుకుని, పోయి నీరున్న చోటు కనుక్కుని, నీరు తీసుకుని వెనుదిరిగాడు. అతను అడ్డ తోవన తన గురువు ఉన్న చోటికి వస్తుండగా దారిలో అతనికొక మనిషి శవం కనిపించింది. దాని పక్కనే పడి ఉన్న ఆహారాన్ని కాకులు తింటున్నాయి. ఆ మనిషి అయాచకుణ్ణి చూసి పారిపోయిన మనిషే! ఆహారం గొంతుకు అడ్డపడి, ఊపిరాడక ప్రాణం వదిలాడు. అతని పక్కన బోర్లాపడి ఉన్న చెంబులో నీరు లేదు.

అతిథికి పెట్టకూడదనుకునేవాడికి తగిన చావే వచ్చింది లెమ్మనుకుని అయాచకుడు

సి. హనుమంతరావు

తన గురువును చేరుకుని, జరిగిన సంగతి చెప్పాడు.

"అతని శవాన్ని అలా వదిలెయ్యకూడదు. చెయ్యవలసినది చేద్దాం పద." అంటూ నారాయణసన్యాసి తన శిష్యుడితో సహా శవం ఉన్న చోటికి వచ్చాడు. గురువు అజ్ఞ ప్రకారం అయాచకుడు ఎండు కట్టెలూ, నిప్పూ తెచ్చాడు.

శవం దహనమయేటప్పుడు నారాయణ సన్యాసి ఆకాశంలోకి లేచే పొగను చూస్తూ, "మంచి గతికి పోయాడు, స్వర్గం చేరాడు. అనాథగా చచ్చినా, నా ఉద్దేశం నెరవేరింది," అన్నాడు, తనకేదో కనిపించినట్టు.

అయాచకుడికి మటుకు ఏమీ కనపడలేదు.

"అతిథికి అన్నం పెట్టనొల్లని పాపికి మీరు ఉత్తరక్రియలు చెయ్యటమేమిటి? అతనికి స్వర్గం లభించటమేమిటి?" అని అయాచకుడు గురువును అడిగాడు.

"వాడు చేసిన పాప పుణ్యాలు చావుతో తీరాయి. తెలియకుండా పుణ్యాలు చేసి ఉండవచ్చు కద? ఉదాహరణకు, చచ్చేటప్పుడు వాడికి తెలియకుండానే వాడి ఆహారం పక్షులకూ, ఇతర ప్రాణులకూ ముట్టింది. ఈ ఒక్క కారణంగానైనా వాడికి స్వర్గం సిద్ధించాలన్న నమ్మకంతో నేను వాడికి అంత్యక్రియలు చేశాను. నా ఉద్దేశం



నెరవేరటం కళ్ళారా చూశాను," అన్నాడు నారాయణసన్యాసి.

"మరి నా కళ్ళకు ఏమీ కనపడలేదే?" అని అయాచకుడు అడిగాడు.

"దానికొక సమాచారం చెబుతాను, విను," అంటూ గురువు ఒక కథ చెప్పాడు.

కొన్ని ఏళ్ళ క్రితం కుమారిలభట్టు అని ఒక జ్ఞాని ఉండేవాడు. ఆయన వేద కర్మానుష్ఠానాలలో నమ్మకం గలవాడు. ఆ రోజులలో బౌద్ధులు వైదికమతానికి విరుద్ధంగా తమ మత ప్రచారాన్ని తీవ్రంగా సాగిస్తున్నారు. వాళ్ళ వాదాన్ని ఖండించాలంటే వారి మతాన్ని గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలి. అందుకని

కుమారిలభట్టు బౌద్ధసన్యాసి వేషం వేసు కుని, ప్రయాగలోని ఒక బౌద్ధవిహారం చేరి, ఆ మత తత్వాలను తెలుసుకోసాగాడు.

ఇలా ఉండగా అతను తమ మతానికి బద్ధ శత్రువని బౌద్ధులకు తెలిసిపోయింది. వాణ్ణి ప్రాణాలతో వదలగూడదను కొని, వాళ్ళు అతన్ని ఏడవ అంతస్తు నుంచి కిందికి తోసేశారు. కింద పడుతూ కుమారిల భట్టు, "వేదాలు నిజమైతే నేను సురక్షి తంగా కిందపడతాను," అనుకున్నాడు. అలాగే అతను ఏ దెబ్బా తగలకుండా కింద పడ్డాడు. అయితే అతని ఒక కంట్లో రాతి పలుకు గుచ్చుకుని చాలా బాధ పెట్టింది.

తాను వేదాలపై అంత నమ్మకం ఉంచి ఉండగా ఈ కన్నుకు ఇలా ఎందుకు బాధ కలిగిందో తెలియక కుమారిలభట్టు తన గురువును అడిగాడు.

"నువు వేదాలను పూర్తిగా నమ్మక, వేదాలు నిజమైతే, అంటూ సందేహం వెలి బుచ్చావు. అందుకే ఇలా జరిగింది. 'నిజ మైన వేదాలు నాకు ఏ బాధా కలిగించవు,' అని నువు అనుకున్నట్టయితే నీకి బాధ కలిగి ఉండేది కాదు," అన్నాడు కుమారిల భట్టు గురువు.

నారాయణసన్యాసి ఈ కథ చెప్పి, "నేను చూసిన దృశ్యం నీకు ఎందుకు కనిపించ లేదో ఇప్పుడు తెలిసిందా?" అని అయాచకుణ్ణి అడిగాడు.

"ఆ పుణ్యాత్ముడి కథకూ, ఈ పాపా త్ముడి కథకూ సంబంధం ఏమిటో నాకు



ఎంత ఆలోచించినా అర్థం కావటం లేదు." అన్నాడు శిష్యుడు.

"అయితే ఇంకో కథ విను. అది వింటే రెంటికీ సంబంధం తెలుస్తుంది." అన్నాడు నారాయణసన్యాసి, మరొక కథ చెబుతూ.

సనందనుడు అనే భక్తుడు ఒక యోగి వద్ద నరసింహమంత్రం ఉపదేశం పొంది, నరసింహస్వామిని సాక్షాత్కారం చేసుకోవాలని ఒక అడవిలో కూర్చుని ధ్యాన సమాధిలో పడిపోయాడు. ఆ సమయాన ఒక బోయవాడు ఒక జింకను తరుముతూ అక్కడికి వచ్చి, "ఇలా ఒక జింక వచ్చింది, చూశావా?" అని సనందనుణ్ణి అడిగాడు.

"ధ్యానంలో ఉన్న వాణ్ణి, ఎలా చూడగలను?" అన్నాడు సనందనుడు.

"నువు ఎవరు? ఇక్కడ, ఈ అరణ్యంలో ఎందుకు ఇలా కూర్చున్నావు?" అని బోయవాడు అడిగాడు.

వాడికి పెద్ద విషయాలు అర్థం కావనుకుని, "నేనూ నీలాగే వేటగాణ్ణి. నువు జింక కోసం తిరుగుతున్నావు. నేను కూడా ఒక మృగం కోసం ధ్యానం చేస్తున్నాను." అన్నాడు సనందనుడు.

"అదేమి మృగం? ఎలా ఉంటుంది?" అని బోయవాడు అడిగాడు.

సనందనుడు నరసింహావతారాన్ని వర్ణించి చెప్పాడు.

"అడవిలో ఉండే అన్ని మృగాలూ నాకు తెలుసు. నువు చెప్పే మృగం ఎక్కడా లేదు." అన్నాడు బోయవాడు.



"నిశ్చయంగా ఉన్నది. కాని నీకు కన బడదు," అన్నాడు సనందనుడు.

"జ్ఞానులు మీరు ఉన్నదంటున్నారు గనక, అది ఎక్కడ ఉన్నా పట్టితెచ్చి మీ కిస్తాను," అని బోయవాడు నరసింహం కోసం అడవి అంతా గాలించాడు. అది ఎక్కడా కనిపించలేదు. అన్న మాట నిల బెట్టుకోలేక పోయినందుకు వాడు ఉచ్చు మెడకు వేసుకుని ఉరిపోసుకోబోయాడు.

ఆ క్షణంలో సగం సింహమూ, సగం మనిషీ అయిన మృగం ఒకటి వాడి ముందు నిలబడింది. బోయవాడు తన మెడకు వేసుకున్న ఉచ్చునుతీసి ఆ మృగా నికి తగిలించి, తీసుకువచ్చి సనందనుడి ముందు పెట్టి, "ఇదుగో నండీ, మీరు చెప్పిన మృగం చివరకు దొరికింది," అని ఆ మృగాన్ని దువ్వుతూ చూపించాడు.

సనందనుడికి ఏమీ కనిపించ లేదు. కాని అతనికి ఇలా వినిపించింది:

"సనందనా, గురూపదేశం పొందని బోయవాణ్ణి నువ్వు అల్పుడుగా భావించి అతనికి నేను కనపడ ననుకున్నావు. నీ ధ్యానం కన్న అతని నమ్మకం గొప్పదని తెలుసుకో."

సనందనుడు బోయవాడితో, "నువ్వు నమ్మకమనే ఉచ్చుతో ఆ మృగాన్ని పట్టుకో గలిగావు. నేను సమాధి స్థితిలో గాని ఆ మృగాన్ని చూడలేనని అపోహ పడ్డాను. నా గురూపదేశం అదీ అంతావృథా. నమ్మకమే గొప్పది," అంటూ కంట తడి పెట్టు కున్నాడు.

ఇలా కథ ముగించి నారాయణసన్యాసి, "నాకు కనపడ్డ దృశ్యం నీ కెందుకు కనపడలేదో ఇప్పుడు తెలిసిందా?" అని అయాచకుణ్ణి అడిగాడు.

"తెలిసింది. ఆ మనిషి పాపాలు నశించి, అతనికి సద్గతి కలగాలన్న దృఢ నిశ్చయంతో మీరు అతనికి అంత్యక్రియలు జరిపారు. అందుచేత ఆ దృశ్యం మీకు కనపడింది. నాలో అలాటి నమ్మకం లేక నేను చూడలేక పోయాను," అన్నాడు అయాచకుడు.



# మోసపోవడానికి కారణం

పూర్వం ఒక రాజుకు ఒక వింత సందేహం పట్టుకున్నది. ఎంతెంత తెలివిగల వాళ్ళు కూడా ఏదో సమయంలో మోసపోవటానికి కారణమేమిటి?

రాజుకు కలిగిన ఈ సందేహాన్ని ఎంత మంది మేధావులూ తీర్చలేక పోయేసరికి, తన సందేహం తీర్చిన వారికి అర్ధరాజ్యం ఇస్తానని ప్రకటించాడు; అడ్డమైన వాళ్ళూ తనను విసిగించి పోతారని, తన ప్రశ్నకు సరి అయిన సమాధానం ఇయ్యలేని వాళ్ళ తల తీయిస్తానని కూడా ప్రకటించాడు. ఆ శిక్షకు భయపడి ఎవరూ సమాధానం చెప్ప సాహసించ లేదు.

ఒకనాడు ఒక యువకుడు రాజుతో రహస్యంగా మాట్లాడాలని వచ్చి, "మహారాజా, నేను మీ పొరుగు రాజైన కాంచనవర్మ అంతరంగికుణ్ణి. మీరు ఆయనను జయించాలని ఒక ప్రయత్నం చేస్తే అది నెగ్గలేదు. రేపు మా రాజు వనకపాలేశ్వరిని పూజించటానికి అడవికి వస్తున్నాడు. ఆయన మా తమ్ముణ్ణి అకారణంగా ఉరి తీయించాడు. రేపు మీరు మారువేషంలో నా వెంట వచ్చి ఆయనను పట్టుకుంటే నా పగ చల్లారుతుంది," అన్నాడు.

రాజు పరమానందం చెంది, మర్నాడు ఆ యువకుడి వెంట అడవికి వెళ్ళాడు. అక్కడ నలుగురు మనుష్యులు రాజును చుట్టుముట్టి పట్టుకున్నారు. రాజు, "మోసం! మోసం!" అని అరిచాడు.

"క్షమించండి, మహారాజా! నేను తమ పౌరుణ్ణే. మనుషులు మోసపోవటానికి దురాశే కారణమని నిరూపించటానికి ఈ నాటకం ఆడాను," అన్నాడు యువకుడు. రాజు అతనికి అర్ధరాజ్యంతో బాటు తన కూతురిని కూడా ఇచ్చాడు.

—చిరమన శ్రీనివాసులు





# తగినవాడు

ఒక గ్రామంలో ఒక పిసినిగొట్టు జమీందారు ఉండేవాడు. అతని దగ్గిర ఏ కూలివాడూ పట్టుమని పదిరోజులు పనిచేసే వాడుకాడు. ఎవరైనా నిలకడగా పనిచేసినా, పని పూర్తి కాగానే జమీందారు ఏదో కిటుకు ఉపయోగించి, కూలిడబ్బులు ఎగగొట్టేవాడు.

కాని రామయ్య అనే అమాయకుడు, జమీందారుగారి తండ్రి కాలంనుంచే ఆ ఇంట చాకిరీ చేసినవాడు కావటంచేత, జమీందారు ఇచ్చినా, ఇయ్యక పోయినా, పాత విశ్వాసంతో, చెప్పిన పనల్లా చేస్తూ పోయేవాడు. జమీందారు ఇచ్చే కొద్దిపాటి కూలిడబ్బులు రామయ్యకు ఏ విధంగానూ సరిపోయేవి కావు.

ఒక సారి జమీందారు ఏదో నెపం పెట్టి రామయ్య నెల జీతం పూర్తిగా ఎగగొట్టాడు. ఆ డబ్బు కోసం గంపెడు ఆశతో ఎదురు చూస్తున్న రామయ్య ఉత్త చేతులతో ఇంటికి తిరిగి వెళ్ళాడు. అది చూసి అతని పెళ్ళామూ, పిల్లలూ చాలా వ్యథచెందారు.

రామయ్య కొడుకు భీమన్న, పధ్నాలుగేళ్ళ కుర్రవాడు, ఇది ఏ మాత్రమూ సహించలేక పోయాడు. వాడు తండ్రితో, "నీ కూలి డబ్బులతో మనం బతకలేం. ఇక నువు విశ్రాంతి తీసుకో. రేపటి నుంచీ నేను పనిలోకి పోతాను," అన్నాడు.

మర్నాడు పనిలోకి వచ్చిన భీమన్నను చూసి జమీందారు, "నువ్వెవరు?" అని అడిగాడు.

"రామయ్య కొడుకును. నా పేరు భీమన్న," అన్నాడు భీమన్న.

"మరి మీ అయ్య కేమయింది?" అని జమీందారు అడిగాడు.

"ఇక నుంచీ పనిలోకి నేనే వస్తూంటాను. మరో నెల మాత్రం మీ వద్ద పని చేద్దామనుకుంటున్నాను. నెల ముగియగానే

బూర్లె నాగేశ్వరరావు

నాకు జీతం ఇచ్చి పంపెయ్యాలి," అన్నాడు భీమన్న.

వాడు గడువు ఏర్పాటు అనే సరికి జమీందారుకు పుట్టెడు ఆశకలిగింది. ఎందు కంటే తాను మోసగించటానికి ఇందులో అవకాశాలు ఎక్కువ.

"ఇదుగో, భీమన్నా! నేను చెప్పిన పనల్లా అక్షరాలా చేసి తీరాలి. అడ్డు చెప్ప కూడదు. ఇష్టమైతేనే పనిలో ప్రవేశించు," అన్నాడు జమీందారు.

అందుకు భీమన్న సమ్మతించాడు. భీమన్నకు సాధ్యంకాని పని చెబితే, వాడు పని పూర్తికాకుండానే మానుకోవచ్చు. అందుచేత జమీందారు వాడికి మొక్కజొన్న చేనుకు నీరు పెట్టటమూ, కాపలా కాయ టమూ చెయ్యమని చెప్పాడు. నెల పూర్తి కాగానే భీమన్నను ఉత్త చేతులతో పంపే ఉపాయం జమీందారుకు తెలుసును.

నెల పూర్తి కావచ్చింది. మొక్కజొన్న చేను కోతకు వస్తున్నది.

ఒక రోజు చేను చూడటానికి వచ్చిన జమీందారు భీమన్నతో, "చూడు, భీమన్నా. మన చేలో కొన్ని కర్రలకు రెండేసి కండె లున్నాయి; మరికొన్నిటికి ఒక్కొక్కటే ఉన్నది. అలా ఉండటానికి వీల్లేదు. చేను సక్రమంగా ఉండాలి. చేలో ప్రతి మొక్కకూ రెండేసి కండెలు ఉండేలా



చూడు," అని వెళ్ళిపోయాడు, తన తెలివికి తానే అబ్బురపడుతూ.

భీమన్న తనలో తాను నవ్వుకున్నాడు.

రెండు మూడు రోజుల అనంతరం జమీందారు మరొకసారి మొక్కజొన్న చేను చూడవచ్చాడు. చిత్రంగా, చేలో ప్రతి మొక్కకూ రెండేసి కండెలు ఉండటం ఆయనకు కనిపించింది. మరు క్షణంలో ఆయనకు భీమన్న చేసిన పని అర్థమయింది. వాడు ఒక్కొక్క కండె ఉన్న మొక్క లన్నిటినీ పీకేసి, కండెలు కాజేశాడు! కాని అందుకు వాణ్ణి తప్పు పట్టి లాభంలేదు. చేలో అన్ని మొక్కలకూ రెండేసి కండెలు ఉండేటట్టు చూడమన్నది తానే.

ఈ సారి జమీందారు, "ఇదేమిటీ, భీమన్నా? మొక్కజొన్న చేలో అన్ని మొక్కలకూ రెండేసి కండెలు ఎక్కడన్నా ఉంటాయా? ఇది అసహజం కాదూ? మన చేను అన్ని చేలూ ఉండేలాగే ఉండేటట్టు చూడు," అని వెళ్ళిపోయాడు.

వెంటనే భీమన్న కొన్ని మొక్కల నుంచి ఒక్కొక్క కండె విరిచి ఆ కండెలను కూడా బస్తీకి పంపించి అమ్మించాడు.

మర్నాడు చేను చూడటానికి వచ్చిన జమీందారుకు కొన్ని మొక్కలకు ఒక్కొక్క కండె మాత్రమే ఉండటం కనిపించింది.

"దుర్మార్గుడా, ఇందుకా నా దగ్గిర పనికి కుదిరింది? ఉండు నీ మీద ఫిర్యాదు చేస్తా," అంటూ జమీందారు వెళ్ళిపోబోయాడు.

వెనక నుంచి భీమన్న, "చూడండి, జమీందారుగారూ. మీరు మొదటనే షరతు పెట్టారు, మీరు చెప్పిన పని అక్షరాలా చెయ్యాలని. అందుచేత మీరు నా మీద ఎక్కడ ఫిర్యాదు చేసినా ఏమీ లాభం ఉండదు," అన్నాడు.

ఆ మాట నిజమేనని జమీందారుకు తెలును. ఫిర్యాదు చెయ్యటమే జరిగితే తాను కూలిడబ్బులు ఎగగొట్టిన వైనాలన్నీ బయటపడతాయి. అందుచేత ఈ వ్యవహారం ఇంతటితో పోనిద్దా మనుకున్నాడు, ఆయన.

కాని మర్నాడు భీమన్న జమీందారు ఇంటికి వెళ్ళి, "అయ్యా, ఇదుగో మీ కండెలు అమ్మిన బాపతు డబ్బు. ఇందులో న్యాయంగా మా అయ్యకూ, నాకూ రావలిసిన రెండు నెలల జీతమూ మినహాయించు కున్నాను," అంటూ డబ్బు సంచీ జమీందారు ముందు పెట్టాడు.

భీమన్న మంచితనానికి జమీందారు విస్మయం చెందాడు.

"భీమన్నా, ఇంత కాలానికి నాకు తగిన వాడివి దొరికావు. ఇక నుంచీ నువు నా దగ్గిర పాలేరుగా ఉండి పని చెయ్యి. న్యాయంగా నీ జీతం నీకు ఇస్తాను," అన్నాడు జమీందారు. భీమన్న అందుకు ఒప్పుకున్నాడు.





# మతిమరుపు మనిషి

ఒక ఊళ్ళో యాదగిరి అనే మతిమరుపు మనిషి ఉన్నాడు. యాదగిరికి చిన్నతనంలోనే పుట్టెడు మతిమరుపు వచ్చేసింది. ఎవరో తలమాసిని మామగారు యాదగిరికి తన పిల్లనిచ్చి పెళ్ళి చేశాడు. యాదగిరి పొరుగూరే అత్తవారి ఊరు.

ఒకసారి ఏదో పండుగ సందర్భంలో యాదగిరి మామగారు అల్లుణ్ణీ కూతుర్నీ పుట్టింటికి ఆహ్వానించడానికి వచ్చాడు. వెళ్ళే ముందు, "నువ్వూ, అమ్మాయీ తెల్లవారగానే వచ్చేయండి," అని చెప్పాడు.

మామగారు వెళ్ళిపోయాక, ఆయన వచ్చి వెళ్ళిన పనేమిటో బుర్రబద్దలు కొట్టుకున్నా జ్ఞాపకం రాలేదు యాదగిరికి. "ఇంతకీ మీ అయ్య ఎందుకు వచ్చినట్లు?" అని అనుమానంగా అడిగాడు పెళ్ళాన్ని.

"నీ మతిమరుపు మండినట్లే ఉంది. మనని పండక్కి రమ్మని పిలవడానికి వచ్చాడు," అని చిరాకు పడుతూ జవాబిచ్చింది వాడి పెళ్ళాం.

మర్నాడు మొగుడూ పెళ్ళాలిద్దరూ వేకువ ఝామునే లేచారు. "మన ఎడ్ల బండిలోనే వెళదాం. బండి సిద్ధంచేయి," అని మొగుణ్ణి ఆజ్ఞాపించింది పెళ్ళాం.

పెరట్లో ఉన్న ఎడ్లబండిని వీధిలో పెట్టి, లోపల ఎండుగడ్డి పరచి సిద్ధపరిచాడు యాదగిరి. తీరా బయలుదేరే ముందు తాళం కప్ప కనిపించ లేదు. "మతిమరుపు ముండవి, ఎక్కడ పారేశావో వెతుకు," అని పెళ్ళాం మీద విరుచుక పడ్డాడు యాదగిరి.

పెళ్ళాం ఇల్లంతా వెతికింది. తాళం కప్ప ఎక్కడా లేదు. "నేను వెతుకుతాను ఉండు," అంటూ చేతిలో వస్తువు గూట్లో పెట్టాడు యాదగిరి. ఆశ్చర్యం! అదే తాళం కప్ప. మళ్ళీ మర్చిపోతానేమోనని చేతిలో

ఎం. కామేశ్వరరావు

తాళం కప్పు పెట్టుకున్న సంగతి మర్చి పోయాడు యాదగిరి.

"నీ మొహం తగలెయ్య! చేతిలోనే పెట్టుకుని ఇల్లంతా వెతికించావు కదా?" అన్నది వాడి పెళ్ళాం.

ఇంటికి తాళం పెట్టి, ఇవతలకి వచ్చి చూస్తే బండి సిద్ధంగా ఉందిగానీ ఎడ్లు లేవు. బండి సిద్ధంచేస్తూ ఎడ్ల సంగతి మర్చి పోయాడు యాదగిరి. కాపుకుఱ్ఱాడు వాటిని పొలంలోకి తోలుకుపోయాడు.

చేసేది లేక, మొగుడూ పెళ్ళా లిద్దరూ బాడుగ జట్కాబండిలో బయలుదేరారు. వేగంగా వెళుతూన్న జట్కాలో కూర్చున్న యాదగిరి, "మన ఎడ్లు బాగానే పరిగెడు తున్నాయి," అన్నాడు భార్యతో.

"నా ఖర్మ కొద్దీ దొరికావు! అప్పుడే జట్కా ఎక్కిన సంగతి మర్చిపోయావు," అని మందలించింది పెళ్ళాం.

బాగా ఎండ ఎక్కే వేళకి పొరుగూరు చేరింది, బండి. బాడుగ ఈయడం మర్చిపోయి వచ్చేస్తున్న యాదగిరి వెంట, "నా బాడుగ ఇప్పించండి," అంటూ పడ్డాడు బండివాడు.

మామగారే బాడుగ చెల్లించి, అల్లుణ్ణి ఇంట్లోకి తెచ్చుకున్నాడు. పెళ్ళాం ఇంటి లోపలికి వెళ్ళిపోయింది. వీధిగదిలో మామా అల్లుళ్ళు కబుర్లల్లో దిగారు. మామ గారు అల్లుడి ఫలహారం ఏర్పాట్లు చేశాడు. అంతా అయ్యాక ఆయన మంచినీళ్ళు తీసుకురావడానికి లోపలి కెళ్ళాడు. ఆయన చెంబుతో నీళ్ళు తెచ్చేసరికి అల్లుడు గదిలో లేడు. ఆశ్చర్యంగా ఆయన వీధిఅరుగు మీదకు వచ్చాడు. వీధిలో జట్కాబండిలో కూర్చుని వెళ్ళిపోతున్న అల్లుణ్ణి చూసి కంగారు పడి, "అల్లుడూ, ఎక్కడికి వెళు తున్నావు?" అని పొలికేక పెట్టాడు.

వెళ్ళిపోతూన్న బండి లోంచి, "ఇంటికి! ఇంట్లో మీ అమ్మాయి ఒక్కత్తే ఉంది. ఆ వెర్రిపీనుగకి అసలే చచ్చేంత భయం. నేను లేకుండా క్షణం ఉండ లేదు," అన్నాడు యాదగిరి. చూస్తూండగానే బండి కనుమరుగయి పోయింది.





# స్వర్గత్యాగి

ఒక మనిషి లౌకికజీవితం పూర్తిగా అనుభవించి, ఉత్తమలోకాలు సంపాదించుకోవాలన్న కోరిక పుట్టి, తపస్సు చెయ్యసాగాడు.

మరొక మనిషి ప్రపంచం మీద విరక్తి పుట్టి, అడవి చేరుకున్నాడు. అక్కడ మొదటివాడు అతడికి కనిపించాడు.

ఆ తపస్సు చేసుకునే వాడికి సేవచేసి, అతనితోబాటు తాను కూడా స్వర్గం సంపాదించుకోవచ్చు ననుకుని రెండోవాడు మొదటి వాడితో, " స్వామీ, మీ శిష్యుడిగా నన్ను స్వీకరించండి," అన్నాడు.

"నాకు ఎవరి సేవా అక్కర్లేదు. నన్ను పలకరించకు," అని మొదటి తపస్వి కళ్ళు మూసుకున్నాడు.

" ఈ మహా తపస్వికి తపోభంగం కలగకుండా చూడటమే గొప్ప పుణ్యం," అనుకుని రెండోవాడు కొద్ది దూరంలో తాను కూడా తపస్సు చెయ్యటానికి కూర్చున్నాడు.

అలా తపస్సు చేసుకుంటూనే రెండోవాడు మొదటివాడి తపస్సుకు ఏ పశువులూ, పక్షులూ భంగం కలిగించకుండా చూస్తూ, సమీపంలోకి వచ్చిన వాటిని దూరంగా తరిమేవాడు.

మొదటి తపస్వి రెండోవాడి గొడవే పట్టించుకోకుండా తన గాఢతపస్సులో తాను నిమగ్నుడయ్యాడు.

ఇలా ఉండగా, ఒక చాకలివాడు ఇద్దరు మునులూ తపస్సు చేసుకునే ప్రాంతంలో మంచి సరస్సు ఉండటం చూసి అక్కడ బట్టలు ఉతకసాగాడు.

వాడు బట్టలు ధపా ధపా ఉతుకుతూ ఉంటే తపస్వు లిద్దరికీ భంగం కలిగింది. మొదటి వాడు కళ్ళు తెరిచి, చాకలివాణ్ణి చూసి, కొంచెం చీకాకు పడ్డాడు. ఆ చాకలిని దూరంగా వెళ్ళి బట్టలు ఉతుక్కోమని చెబుదామా అని అతను అనుకుని కూడా,

వి. బాబూరావు

అలా చెయ్యరాదని తీర్మానించుకుని, తిరిగి తపస్సమాధిలోకి వెళ్ళిపోయాడు.

కాని, రెండో తపస్వి కోపంతో లేచిపోయి, చాకలివాణ్ణి, "ఒరే, నీకు బుద్ధి ఉందా? నీ ఉతుకుడుతో తపోభంగం చేస్తావా? వెంటనే ఇక్కడి నుంచి దూరంగా వెళ్ళిపో," అని కసిరాడు.

"పో పోవయ్యా! నీ తపస్సు నా కుటుంబం పొట్టనింపుతుందా?" అని నిర్లక్ష్యంగా జవాబు చెప్పి, చాకలి తన పని సాగించాడు.

రెండో తపస్వి ప్రతిరోజూ ఆ చాకలితో ఘర్షణపడుతూ వచ్చాడు. ఆ చాకలి మాత్రం ఆ రేవు వదలిపోలేదు.

కొంత కాలానికి ఆ చాకలి చచ్చాడు; రెండో తపస్వి కూడా చచ్చాడు. మరికొంత కాలానికి మొదటి తపస్వి దేహంచాలించి స్వర్గానికి పోతూండగా, రెండో తపస్వి నరకంలో బాధలు పడుతూ అతన్ని చూసి, "అయ్యా, నన్ను కూడా మీతోపాటు స్వర్గానికి తీసుకుపొండి. నేను మీకు ఎంతో సేవ చేసినవాణ్ణి కానా?" అన్నాడు.

తరవాత మొదటి తపస్వి స్వర్గం చేరుకున్నాడు. అక్కడ అతనికి స్వర్గసుఖాలు అనుభవిస్తున్న చాకలి కనిపించాడు. అది చూసి అతను తన వెంట ఉన్న దేవదూతతో, "నాతోబాటు తపస్సు చేసినవాడు నరకంలో ఉండటం ఏమిటి? మాకు తపోభంగం కలిగించిన ఈ చాకలి స్వర్గంలో ఉండటం ఏమిటి? ఇది నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది," అన్నాడు.

దానికి దేవదూత, "ఈ చాకలి నీ తపస్సు శీఘ్రంగా ఫలించటానికి తోడ్పడ్డాడు. అతను చేసిన చప్పుడు కారణంగా నువ్వు మరింత ఏకాగ్రత సాధించగలిగావు. ఈ చాకలి తన ధర్మం తాను నెరవేర్చాడే గాని, ఏ పాపమూ చేసినవాడు కాడు. నీ అనుచరుడు తపస్సు చెయ్యలేదు. అతనికి ఏకాగ్రత ఏ మాత్రమూ కుదరలేదు. నీ తపస్సును సంరక్షిస్తున్నాననుకుని పశుపక్ష్యాదుల మీద రాళ్ళు విసరటమూ, చాకలితో ఘర్షణ పడటమూ లాటి పనులు చేశాడు," అన్నాడు.





ఒక రాజు ప్రతి ఏడూ ఒక ప్రత్యేక సభ చేసి, దానికి బుద్ధికుశలత గల యువకులను ఆహ్వానించేవాడు. ఒకసారి ఈ సభలో గణపతి అనే యువకుడు అందరి కన్న ఎక్కువ చాకచక్యం చూపాడు.

"చేతులున్న మొండి వాళ్లని మీలో ఎవరైనా చూశారా?" అని ప్రధాన మంత్రి మాటల సందర్భంలో అన్నాడు.

దానికి గణపతి, "నేను ఇక్కడికి వస్తూండగా దారిలో ఒక బిచ్చగాడు కలమూ, కాగితమూ దగ్గిర పెట్టుకుని, అందరినీ అడిగినట్టే నన్ను కూడా, 'అయ్యా, ధర్మం!' అని అడిగాడు. నేను నాకు తోచినది వాడికి ఇచ్చాను. వాడు వెంటనే కాగితం మీద 'రెండు' అని రాసుకున్నాడు. 'ఏమిటి రాస్తున్నావు?' అని నేను వాణ్ణి అడిగాను. 'మరేమీ లేదు. చేతులుండి మొండి వాళ్ళు కాని వాళ్ళ లెక్క వేస్తున్నాను. మీరు రెండో వారు,' అన్నాడు బిచ్చగాడు. దానధర్మాలు చెయ్యని వాళ్ళు చేతులుండి కూడా మొండి వాళ్ళనని వాడి ఉద్దేశం," అన్నాడు.

"అలాగే, కళ్ళుండి గుడ్డివాళ్ళు కూడా కావచ్చుగా?" అన్నాడు మంత్రి. దానికి సమాధానంగా గణపతి ఇలా చెప్పాడు:

"చిత్తం! ఒకసారి నేను ఒక నగరానికి వెళ్ళాను. అక్కడ ఒక ఇంటికి తాళం పెట్టి ఉన్నది; కాని లోపల ఏదో అలికిడి అవుతున్నది. 'ఎవరు లోపల?' అని కేక పెట్టాను. సమాధానం రాలేదు. నేను వెంటనే ఇరుగు పొరుగువాళ్ళను చేర్చాను. పారిపోవటానికి సిద్ధంగా ఉన్న దొంగను వాళ్ళు పట్టుకున్నారు. ఆ దొంగ నన్ను చూసి, 'నీలాగ కళ్ళుండి గుడ్డివాళ్ళు కాని వాళ్ళు అరుదు. అందుకే నా వృత్తి ఇంత కాలం చక్కగా సాగింది,' అన్నాడు. ఇల్లు తాళం పెట్టి ఉండటం చూసి కూడా లోపల

ఆర్. సుందరాచారి

అలికిడిని పట్టించుకోని వారంతా కళ్ళుండీ గుడ్డి వాళ్ళే అనుకోవాలి.''

"అలా అయితే నాలుక ఉండి కూడా మూగవాళ్ళు ఎవరంటావు?'' అని మంత్రి మళ్ళీ అడిగాడు.

దానికి గణపతి, "నేను ఒక సారి మా వూళ్ళో ఒక ధనికుడి వద్ద చిన్న మొత్తం అప్పు చెయ్యవలిసి వచ్చింది. వడ్డీ ప్రస్తావన వచ్చి ఆయన నాతో, 'నాలుక ఉండి కూడా మూగవాళ్ళయిన వారికి రూపాయికి నెలకు పావలా వడ్డీ. అలా కాని వారికి వడ్డీ లేదు.' అన్నాడు. అంటే ఏమిటని అడిగాను. అప్పు తీసుకుని ఇస్తా మన్న గడువుకు ఇయ్యక, అందుకుగాను ఏవో అబద్ధాలు చెప్పేవాళ్ళూ, అబద్ధాలు కారణంగా చెప్పి అప్పు అడిగే వాళ్ళూ నాలుక ఉండి కూడా మూగవాళ్ళేనని ఆయన అన్నాడు,'' అన్నాడు.

"చెప్పకుండా పోయేదీ, చెప్పకుండా వచ్చేదీ చావుగాక మరేదైనా ఉన్నదా?'' అని మంత్రి అందరినీ అడిగాడు.

దానికి ఎవరూ సమాధానం చెప్పక పోయేసరికి గణపతే ఇలా అన్నాడు:

"యౌవనం చెప్పకుండా వెళ్ళిపోతుంది. గనక జాగ్రత్తగా ఉండాలనీ, చెప్పకుండా వచ్చే అదృష్టాన్ని నమ్ముకుని భ్రష్టుకారాదనీ మా తాత తరుచూ అనేవాడు.''

"అనేకసార్లు చచ్చేవాళ్ళు ఉంటారా?'' అని మంత్రి అడిగాడు. దానికి కూడా గణపతే సమాధానం చెప్పాడు:

"నేను ఈ నగరంలో ప్రవేశించి, ఒక ఇంటి అరుగు మీద ఏడుస్తూ కూర్చుని ఉన్న ఒక మనిషిని చూసి, 'ఎందుకమ్మా, ఏడుస్తున్నావు?' అని అడిగాను. దాని కామె, 'ఏడవక ఏం చేసేది, నాయనా? నా భర్త రోజూ చస్తున్నాడు. నా జీవితమంతా ఏడుపు గానే ఉంది. వీరుడైన నా కొడుకు రెండేళ్ళ క్రితం ఒకేసారి చచ్చాడు. నా భర్త పిరికి వాడు, రోజుకు పదిసార్లు చస్తాడు.' అన్నది.

గణపతిని కొలువులో చేర్చుకోవచ్చునని ప్రధానమంత్రి రాజుకు సలహా ఇచ్చాడు. గణపతికి ఉద్యోగం దొరికింది.



# జ్ఞానికి బోధ

ఒక జ్ఞాని ప్రజలకు తత్వోపదేశాలు చేసి, వాళ్ళను సన్మార్గంలో పెట్టదలచి, తాను ఉండే నగరంలోని వాళ్ళను చేర్చి, వారికి నీతి, సదశా, ధర్మా, కర్మా, భక్తి, ముక్తి మొదలైనవి బోధిస్తూ, అదే తన జీవిత కర్తవ్యంగా భావించాడు. కాని ఆయన ప్రయత్నం ఫలించ లేదు. ప్రజలు ఆయన హితబోధలు వినకపోగా, ఆయనకు వేరే పని ఏమీ లేదు కాబోలు నని, ప్రజలను మోసగించటానికి అది ఒక ఎత్తు అయి ఉంటుందనీ ఆయన ముఖానే అన్నారు.

జ్ఞాని ఆ నగరం విడిచి మరొక నగరం వెళ్ళాడు. అక్కడా ఇలాగే జరిగింది. ఇంకొక నగరం వెళ్ళాడు. లాభం లేకపోయింది. ఆయన, ప్రాణం విసిగి, జ్ఞానబోధలు కట్టిపెట్ట, తపస్సు చేసుకుందామని అడవికి వెళ్ళాడు.

అక్కడ ఒక దొంగ కనపడి, "నీ దగ్గిర ఉన్నది అక్కడ పెట్టు," అన్నాడు.

"నా దగ్గిర ఏమీలేదు. నేను ప్రజలకు జ్ఞానబోధ చేద్దామని ప్రయత్నించాను. నా జ్ఞానాన్ని ప్రజలు పట్టించుకున్నారు కాదు. తపస్సు చేసుకుందామని ఇలా వచ్చాను," అన్నాడు జ్ఞాని.

వెంటనే దొంగ చొక్కా విప్పి, తన వీపు మీద దెబ్బల వాతలు చూపించి, "నేను దొంగతనం చేసి పట్టుబడి నప్పుడల్లా ఇలా దెబ్బలు తిన్నాను. అయినా నా ప్రయత్నం మానలేదు. ఏ పని చేసినా తిట్టే వాళ్ళుంటారు. నీకు దీక్ష లేదు," అన్నాడు.

ఆ మాటతో జ్ఞానికి జ్ఞానోదయమై, తిరిగి ప్రజలకు బోధ చెయ్యటానికి బయలుదేరాడు.





# దొరలూ-దొంగలూ

పూర్వం ఒక పట్టణంలో రామిశెట్టి అని ఒక వర్తకుడు ఉండే వాడు. అతను వర్తక వ్యాపారాలలో సమర్థుడే గాక, చాలా నిజాయితీ గలవాడు. అందుచేత పట్టణంలో ఇతర వర్తకుల కన్న అతను చాలా పైకి వచ్చి, పట్టణంలో అతనే పెద్ద వర్తకుడు అయాడు. అతని బాగు చూసీ, పేరు ప్రతిష్ఠలు చూసీ పట్టణంలోని ఇతర వర్తకులు అసూయపడేవారు.

ఒకసారి పట్టణంలోని వర్తకులందరూ కలిసి సరుకులు కొనుక్కురావటానికి బయలుదేరారు. ఎవరు కోరిన సరుకు వారుకొని, వాటిని తమ తమ వాహనాల మీద వేసుకుని తమ పట్టణానికి తిరుగు ప్రయాణమయారు.

చీకటి పడేవేళకు వారు ఒక మంటపం చేరి, ఆ రాత్రికి అక్కడే మకాము చేసి, వంటలు చేసుకుని భోజనాలు చేశారు. తరవాత మిగతా వర్తకులు రామిశెట్టితో, తాము సమీపంలో ఉన్న గ్రామానికి వెళుతున్నామనీ, అక్కడ ఏదో ఉత్సవం జరుగుతున్నదనీ, తాము తిరిగి వచ్చేదాకా తమ సరుకుల మూటలు చూస్తూ ఉండాలనీ అన్నారు. రామిశెట్టి సరే నన్నాడు.

తరవాత కొంత సేపటికి కొందరు ముసుగు మనుషులు మండపం వద్దకు వచ్చి, రామిశెట్టి చూస్తూ ఉండగానె వర్తకుల మూటలు ఎత్తసాగారు. రామిశెట్టి వారికి అడ్డం పోతే వాళ్ళు అతన్ని చితక తన్ని మూటలు తీసుకుని వెళ్ళిపోయారు.

రామిశెట్టికి దెబ్బల బాధతో బాటు, తన అనుచరుల నష్టానికి తాను పూచీ అయానన్న బాధ కూడా కలిగింది. జరిగిన సంగతి తన అనుచరులకు చెప్పటం తన విధి అనుకుని, అతను వారు వెళ్ళిన దిక్కుగా మెల్లిగా బయలుదేరాడు.

కె. మహమ్మద్ ఫిదాహుసేన్

కొంతదూరం వెళ్ళేసరికి చాలామంది మనుషులు కొట్లాడుకుంటున్న సంగతి రామిశెట్టికి తెలియవచ్చింది. అతను ఆ ప్రదేశానికి వీలయినంత సమీపంగా వెళ్ళి, అక్కడవున్న చెట్లచాటున దాక్కొని కొట్లాట గమనించసాగాడు.

తమ సరుకుల మూటలు తీసుకుపోయిన ముసుగు మనుషులకూ మరొక ముఠాకూ ఘర్షణ జరుగుతున్నది. రెండో ముఠావాళ్ళు కూడా దొంగలేనని రామిశెట్టి వారి మాటలను బట్టి గ్రహించాడు.

" ఈ వెధవలని మన నాయకుడి దగ్గిరికి తీసుకుపోదాం. మన ప్రాంతంలో వీళ్ళు దొంగతనం చెయ్యటానికి వీలు లేదు. వీళ్ళను ప్రాణాలతో వదలకూడదు, చంపాలిసిందే!" అంటున్నాడు రెండో ముఠాలోని ఒక దొంగ.

ఆ మాట వినగానే ముసుగు మనుషులంతా ఆ దొంగ కాళ్ళపైన పడి, "అన్నా, మమ్మల్ని చంపవద్దు. మేము దొంగలం కాము. ఈ సరుకును మేము దొంగిలించలేదు. ఇదంతా మా సరుకే. మేము వర్తకులం. మాలో ఒకడికి అపకారం చెయ్యాలనుకుని మేము ఇలా దొంగవేషాలు వేసుకుంటే, అది కాస్తా ఇలా ఎదిసి కొట్టింది. మమ్మల్ని చంపవద్దు. కావలిస్తే ఈ సరుకంతా తీసుకుని క్షమించి విడిచిపెట్టు," అని బతిమాలుకున్నారు.

దొంగ వారిమాటలు నమ్మక, "మీరు దొంగలు కారనటానికి సాక్ష్యం ఏమిటి? మీరు



అబద్ధాలాడటం లేదని మాకు రుజువేమిటి? మీరు చెప్పకునే దంతా మా నాయకుడికి చెప్పకోండి," అన్నాడు.

ముసుగు మనుషులు తమ ముసుగులు తీసి, "మేము దొంగల్లాగా ఉన్నామా? చూడు!" అన్నారు.

"అవును! మీరు అచ్చంగా దొంగల్లాగే ఉన్నారు. ఆ దొంగల్లో కూడా బాగా ఆరి తేరిన వాళ్ళలా వున్నారు," అన్నాడు దొంగ.

ఆ సమయంలో రామిశెట్టి ముందుకు వచ్చి దొంగలతో. "వీళ్ళు దొంగలు కారు. నా తోటివర్తకులు. నా మీద ఏదో పగఉండి, దొంగల వేషాలు వేసుకుని. తమ సొత్తు తామే దొంగతనం చేసి ఉంటారు. ఎందు కంటే ఆ సొత్తుకు నన్ను కాపలాపెట్టి వెళ్ళిపోయారు. ఆ సొత్తుపోతే, నా సొత్తు పోవటంతో బాటు వారి సొత్తు పోయినందుకు నేను వారికి నష్టపరిహారం ఇచ్చుకోవాలి గద. అందుచేత వాళ్ళు నాకు ద్రోహం తల పెట్టారు గాని, మీ కేమీ ద్రోహం చెయ్యలేదు. మీకు సొత్తుకావాలంటే అంతా తీసుకోండి గాని, వాళ్ళను బాధ పెట్ట వద్దు. వది లెయ్యండి," అన్నాడు.

దొంగలు తమలో తాము కూడబలు క్కున్నారు. రామిశెట్టి ఔదార్యం వాళ్ళకు నచ్చింది. వాళ్ళు అతనితో, "వీళ్ళు ఏ ఉద్దేశంతో చేసినా చేసినది దొంగతనమే గనక దీన్ని మేము తీసుకుని నీకు ఇచ్చేస్తాం. నువు యోగ్యుడవి. ఇదంతా నువే ఉంచుకో. వారికి ఇవ్వకు," అని చెప్పి దొంగలు తమ దారిన తాము వెళ్ళిపోయారు.

రామిశెట్టి ఎవరిసొత్తు వారికి ఇచ్చేసి, "మీ కన్న ఆ దొంగలు చాలా నయం. మీరు మీ సొత్తే దొంగిలించినా నాకు నష్టం కలగా లనే దొంగతనం చేశారు. మీరు దొంగలు, వర్తకులు కారు. అందుకే మీరు వర్తకంలో పైకి రాలేరు," అని తోటి వర్తకులను మందలించాడు.

వాళ్ళు రామిశెట్టికి క్షమాపణ చెప్పకుని, చెంపలు వేసుకుని వలవలా ఏడ్చారు. అటు తరవాత వాళ్ళు ఆయనకు పరమ భక్తులుగా మారారు.






భీష్ముడు దుర్యోధనుడికి ఉభయపక్షాల వీరులను గురించి వివరంగా చెప్పిన మీదట దుర్యోధనుడు ఆయనను, "తాతా, శిఖండి యుద్ధానికి వస్తే అతన్ని ఎందుకు చంపనంటావు? సోమకులతో సహా పాంచాలులందరినీ చంపుతానని నువ్వు ముందు చెప్పి ఉన్నావే?" అని అడిగాడు.

దానికి భీష్ముడు ఇలా సమాధానం చెప్పాడు:

"నేను శిఖండిని యుద్ధరంగంలో ఎందుకు ఎదుర్కోనో చెబుతాను, ఈ రాజులందరితోపాటు నువుకూడా విను. నా తండ్రి శంతనమహారాజు దీర్ఘకాలం రాజ్యపాలన చేసి చనిపోయిన అనంతరం, నేను చిత్రాంగదుణ్ణి రాజుగానూ, విచిత్రవీర్యుణ్ణి యువరాజుగానూ అభిషేకించాను. కొంత కాలానికి చిత్రాంగదుడు పోయాడు. అప్పుడు నేను విచిత్రవీర్యుణ్ణి రాజును చేసి, అతనికి నేను అండగా ఉంటూ రాజ్యపాలన చేశాను.

"అతనికి యుక్తవయసు వచ్చింది. అతనికి తగిన కన్యను చూసి పెళ్ళి చేయ నిశ్చయించాను. ఆ సమయంలో కాశీరాజు కూతుళ్ళు ముగ్గురు స్వయంవరం చేసుకోబోతున్నారని తెలిసింది. వాళ్ళు మంచి అందగత్తెలు. వాళ్ళ పేర్లు అంబా, అంబికా, అంబాలికా. స్వయంవరానికి రాజులందరూ ఆహ్వానించబడ్డారు. నేను ఒంటరిగా రథం మీద కాశీరాజధానికి వెళ్ళి, సాటిలేని అందగత్తెలయిన రాజకుమార్తె



లను చూశాను. స్వయంవరానికి వచ్చిన రాజులందరినీ కూడా చూశాను. నేను వారినందరినీ నాతో యుద్ధానికి ఆహ్వానించి, రాజకుమార్తెలను ముగ్గురినీ నా రథంలో ఎక్కించుకున్నాను.

"'రాజులారా, నేను ఈ ముగ్గురు కన్యలనూ తీసుకు పోతున్నాను. నేను శంతనుడి కొడుకును. నా పేరు భీష్ముడు. మీకు చేతనైతే ఈ కన్యలను విడిపించు కోండి,' అని నేను రాజులతో అన్నాను. వాళ్ళకు నా మీద చాలా కోపం వచ్చి, రథాల మీదా, ఏనుగుల మీదా, గుర్రాల మీదా ఆయుధాలు ఎత్తి, నా మీదికి యుద్ధానికి వచ్చారు. నేను వాళ్ళను బాణవర్షంలో ముంచి, ఓడించాను. వాళ్ళు యుద్ధరంగం వదిలి పారిపోయారు.

"నేను కాశీరాజు కుమార్తెలను తీసుకు వచ్చి, సత్యవతికి చూపి, వాళ్ళను విచిత్ర వీర్యుడికి భార్యలుగా తెచ్చానని చెప్పాను. ఆమె నేను చేసిన పనికి చాలా సంతోషించింది. నేను పెళ్ళి ప్రయత్నాలు చేస్తూంటే, కాశీరాజు పెద్ద కూతురు, అంబ తాను సాళ్వరాజును ప్రేమించాననీ, అతను కూడా తనను ప్రేమించాడనీ, తాము వివాహం చేసు కోవటానికి నిశ్చయించు కున్నామనీ, ఈ సంగతి తన తండ్రికి తెలియదనీ, తనను సాళ్వరాజు వద్దకు చేర్చమనీ ప్రార్థించింది. నేను మా తల్లి సత్యవతి తోనూ, మంత్రి పురోహితులతోనూ సంప్రదించి, అంబకు దాసీలనూ, రక్షకులనూ తోడు ఇచ్చి, సాళ్వుడి వద్దకు పంపేశాను.

"కాని సాళ్వుడు ఆమెను స్వీకరించక, భీష్ముడు బలాత్కారంగా తీసుకుపోయిన కన్య తనకు అవసరం లేదన్నాడు. 'నేను భీష్ముడికి భార్యను కాలేదు. ఆయనే నన్ను సగౌరవంగా నీ వద్దకు పంపాడు,' అని అంబ అన్నది. ఆమె ఎంత బతిమాలినా, ఏడ్చినా సాళ్వుడు మనసు మార్చుకోక, 'నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళు,' అన్నాడు.

"అంబ తన దుస్థితికి ఎన్నో కారణాలు ఉన్నప్పటికీ, నా మీదనే పగపట్టి బుష

లుండే ఆశ్రమాలకు వెళ్ళింది. అక్కడ శైఖావత్యు డనే ముని అంబకు కలిగిన కష్టం తెలుసుకుని, 'అమ్మాయీ, ఇక్కడ తపస్సు చేసుకునే మునులు నీ కష్టాలను ఏం తీర్చగలరు?' అన్నాడు. తనకు జీవితం మీద విరక్తి కలిగిందనీ, తనకు తపస్సు చేసుకునే పద్ధతి తెలుపమనీ అంబ ఆయ నను వేడుకున్నది.

"తరవాత ఆశ్రమవాసులైన మును లందరూ కలిసి ఆమెను గురించి చర్చిం చారు, కాని ఏ నిర్ణయమూ చెయ్యలేక పోయారు. వాళ్ళు ఆమెను ఆమె తండ్రి ఇంటికి వెళ్ళమన్నారు. అందుకు అంబ ఒప్పుకోలేదు; తపస్సు చేసుకుంటాననీ, ఆ విధానం చెప్పమనీ అన్నది.

ఆ సమయంలో అక్కడికి హెూత్ర వాహను డనే రాజర్షి వచ్చాడు. ఆయన అంబకు తల్లి వైపు తాత. ఆయన అంబ కథ విని చాలా విచారించి, 'అమ్మా, నువు తపస్సు చెయ్యలేవు. జమదగ్ని కొడుకైన పరశురాముడి వద్దకు వెళితే, ఆయన నిన్ను భీష్ముడి దగ్గిరికి చేర్చగలడు; అందుకు భీష్ముడు ఒప్పుకోక పోతే, యుద్ధంచేసి భీష్ముణ్ణి చంపగలడు,' అన్నాడు.

"పరశురాముడు మహేంద్రపర్వతం మీద తపస్సు చేసుకుంటున్నాడు. కాని ఆయన మర్నాడు ఈ ఆశ్రమానికే వస్తు



న్నట్టు వార్త తెలిసింది. మర్నాడు పరశు రాముడు అక్కడికి రానే వచ్చాడు. అక్కడి మునులు, అంబతో సహా, ఆయ నకు అతిథి పూజలు చేశారు. మాటల సందర్భంలో హెూత్రవాహనుడు పరశు రాముడికి తన కూతురి కూతురైన అంబ కథ చెప్పి, ఆమె కష్టం తీర్చమన్నాడు.

"'అమ్మాయీ, నువు భీష్ముడి వద్దకు పోతావా? సాళ్వుడి వద్దకు పోతావా? ఏది కావాలంటే అది నేను సమకూర్చ గలను.' అని పరశురాముడు అంబతో అన్నాడు. తన కష్టాలకు మూలం భీష్ముడే ననీ, అతన్ని చంపితేగాని తన పగ చల్లార దనీ అంబ పరశురాముడితో అన్నది.



"పరశురాముడు నన్ను చంపటానికి ఒప్పుకోలేదు గాని, అంబను నా వశం చెయ్యటానికీ, నేను అంగీకరించక పోతే నాతో యుద్ధం చెయ్యటానికీ ఒప్పుకున్నాడు. ఆయన అంబనూ, కొంతమంది ఋషులనూ వెంట బెట్టుకుని కురుక్షేత్రానికి వచ్చి, సరస్వతీనదీ తీరాన విడిసి, తన కోరిక నెరవేర్చమని నాకు కబురు పంపాడు. నేను ఒక గోవునూ, బ్రాహ్మణులనూ వెంట బెట్టుకుని ఆయనను చూడబోయి, ఆయనకు తగిన పూజలు చేశాను.

"పరశురాముడు నన్ను చూసి, 'భీష్మా, నువు స్త్రీని కోరని వాడివిగదా, ఈ అంబను ఎందుకు బలాత్కారంగా పట్టుకు పోయావు? పట్టుకు పోయిన వాడివి నీ దగ్గర ఉంచుకోక ఎందుకు పంపేశావు? నీ మూలంగా ఈమె జీవితం భ్రష్టమయింది గదా! నువు పట్టుకుపోయిన ఈ పిల్లను మరెవరు పెళ్ళాడతారు? సాళ్వుడు ఈమెను నిరాకరించాడు. అందుచేత ఈమెను నువే పరిగ్రహించు,'' అన్నాడు.

"ఆ మాటకు నేను, ఆమెను నా తమ్ముడి కిచ్చి పెళ్ళి చెయ్యాలనీ, తనకు సాళ్వుడి పైన మనసున్నట్టు ఆమే చెప్పిందనీ, ఆమె కోరి సాళ్వుడి వద్దకు వెళ్ళిందనీ పరశురాముడికి చెప్పాను.

"ఆ మాట విని పరశురాముడు, నేను తన మాట వినకపోతే నన్నూ, నా మంత్రులనూ చంపుతానన్నాడు. నేను ఆయనను శాంతపరచటానికి చూశాను. ఆయన నాకు అస్త్రాలిచ్చిన గురువు. ఆ మాట చెప్పాను. అయితే గురువు ఆజ్ఞ పాటించమని ఆయన పట్టుపట్టాడు. గురువు కాదు గదా, ఇంద్రుడే వచ్చి అధర్మం చెయ్యమన్నా నేను చెయ్యనన్నాను; తప్పని సరి అయితే యుద్ధం చేస్తానన్నాను.

"మా ఇద్దరికీ కురుక్షేత్రంలో మర్నాడు యుద్ధం జరిగేటట్టు ఏర్పాటు చేసుకున్నాం. నేను హస్తినాపురానికి తిరిగివచ్చి, సత్యవతికి సంగతంతా చెప్పి, ఆమె ఆశీర్వాదం పొంది, యుద్ధసన్నద్ధుడనై రథం ఎక్కి

కురుక్షేత్రానికి వెళ్ళాను. పరశురాముడు అప్పటికే అక్కడికి చేరుకుని ఉన్నాడు. మా యుద్ధం చూడటానికి మునులందరూ ఒక పక్కగా నిలిచి ఉన్నారు. నేను పరశురాముడికి నమస్కారం చేసి యుద్ధం చెయ్యటానికి సిద్ధమయాను. మేము ఒకరి నొకరం స్పృహ తప్పి పోయేటట్టు బాణాలతో కొట్టుకున్నాం. మా యుద్ధం ఇరవై నాలుగు రోజులు సాగింది. పరశురాముడు తాను ఓడిపోయినట్టు ఒప్పుకున్నాడు.

"తరవాత ఆయన అంబతో, 'చూశావు గదా, నేను భీష్ముణ్ణి జయించలేక పోయాను. అందుచేత నీకు నేనేమీ చేయలేను. కావాలంటే, నీకై నువే భీష్ముణ్ణి శరణువేడు,' అన్నాడు. అంబ అలా చేయ నిరాకరించి, నన్ను చంపటానికై తపస్సు చేసుకుంటానని వెళ్ళిపోయింది. పరశురాముడు మునులతో సహా మహేంద్రపర్వతానికి వెళ్ళిపోయాడు. నేను అంబ వెంట కొందరు మనుషులను పంపి, ఆమె ఎక్కడికి పోతుందో, ఏం చేస్తుందో కనిపెట్టి నాకు తెలియజేయమన్నాను.

"అంబ యమునా తీరాన ఉండే ఋష్యాశ్రమాలకు వెళ్ళింది. అక్కడ ఆమె ఘోరమైన తపస్సు చేసింది. అలా ఆమె పన్నెండేళ్ళపాటు తపస్సు చేసింది. బంధువులు మధ్యలో మానమని ఎంతగా చెప్పినా



వినలేదు. కొంత కాలానికి ఆమెకు శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. ఆమె నన్ను జయించేటట్టు వరం కోరుకున్నది. శివుడామెకు ఆ వరం ఇచ్చాడు; వచ్చే జన్మలో స్త్రీగాపుట్టి, పురుషుడుగా మారి, నన్ను ఆమె యుద్ధంలో చంపేటట్టు శివుడు చెప్పి, అంతర్ధానమయాడు. ఆమె వెంటనే చితిపేర్చుకుని, 'భీష్ముణ్ణి చంపటానికి అగ్ని ప్రవేశం చేస్తున్నాను.' అంటూ అగ్ని ప్రవేశం చేసింది."

ఈ విషయాలు చెప్పి, భీష్ముడు దుర్యోధనుడికి శిఖండి వృత్తాంతం తెలిపాడు.

ద్రుపదుడి భార్యకు పిల్లలు కలగలేదు. ఆయన కూడా భీష్ముడి చేతిలో ఓడిన వాడే



కావటం చేత, భీష్మణ్ణి చంపే కొడుకు కోసం శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై, "భీష్మణ్ణి చంపగల స్త్రీపురుషుడు కలుగుతాడు," అని చెప్పాడు.

తరవాత ద్రుపదుడి భార్య గర్భవతి అయి, కాలక్రమాన ఒక ఆడపిల్లను కన్నది. కాని ద్రుపదుడు తనకు కొడుకు కలిగినట్టు లోకానికి చాటాడు. తరవాత ఆయన ఈ రహస్యాన్ని చాలా శ్రద్ధగా కాపాడుతూ, ఆ పిల్లకు కొడుక్కు చేయవలిసిన కర్మలన్నీ చేశాడు. కూతురి రహస్యం దాచటంలో ద్రుపదుడి భార్య కూడా చాలా శ్రద్ధవహించింది. ద్రుపదుడికి ఒకటే ధైర్యం—శివుడి మాట ప్రకారం తన కూతురు కొడుకు అవుతుందని. ఆ పిల్లకు ఆయన శిఖండి అని నామకరణం చేశాడు.

శిఖండి చిత్రకళా, శిల్పమూ చక్కగా నేర్చుకున్నది. ఆమె మగవేషంతో ద్రోణుడి వద్దకు వెళ్ళి విలువిద్య అభ్యసించింది. కాలక్రమాన ఆమె యుక్తవయస్కురాలయింది. అది చూసి ద్రుపదుడు చాలా బెంగపడ్డాడు. శివుడు చెప్పినట్టు ఆమె ఇంకా పురుషుడుగా మారనే లేదు.

"శివుడి మాట ఎన్నటికీ అబద్ధం కాదు. మనం మన పిల్లకు తగిన కన్యను చూసి వివాహం చేసేద్దాం," అని ద్రుపదుడి భార్య అన్నది.

ద్రుపదుడు ఈ ఆలోచన ఆమోదించి దశార్ణరాజు కూతురిని శిఖండికి భార్యగా ఎన్నుకుని, వివిధదేశాల రాజులకు ఆ వార్త తెలిపాడు. దశార్ణరాజు హిరణ్యరోముడు చాలా బలవంతుడు. ఆయన కుమార్తె పేరు కూడా శిఖండే. ద్రుపదుడితో వియ్యమందటానికి ఆయన సంతోషించాడు. శిఖండులిద్దరికీ వివాహం జరిగింది.

కొంత కాలానికి దశార్ణరాజు కూతురు యౌవనవతి అయింది. ఆమెకు తన భర్త మగవాడు కాడనీ, ఆడదీ అనీ తెలిసింది. ఆమె సిగ్గుపడుతూ ఈవార్త తన చెలికత్తెలకు చెప్పింది. వాళ్ళు ఈ రహస్యాన్ని దశార్ణరాజుకు అందజేశారు.

దశార్ణరాజు ద్రుపదుడు చేసిన వంచనకు మండిపడి తన దూతను ద్రుపదుడి వద్దకు పంపాడు. దూత వచ్చి తన రాజుమాటలుగా ఇలా చెప్పాడు: "దుర్మార్గుడా, నీ కూతురికి నా కూతురిని పెళ్ళిచేసుకుని నన్ను అవమానించావు. నేను వచ్చి, నిన్నూ, నీ బంధు మిత్రులనూ చంపబోతున్నాను."

ద్రుపదుడి నోట మాట లేదు. ఆయన దశార్ణరాజుకు, "నేను మిమ్మల్ని మోసగించలేదు," అని మాత్రం జవాబు పంపాడు. దశార్ణరాజు తృప్తిపడక, ద్రుపదుణ్ణి నిర్మూలించటానికి వస్తున్నట్టుగా, దూతద్వారా యుద్ధవార్త పంపాడు.

ద్రుపదుడు బెదిరిపోయి, ఇప్పుడు ఏం చెయ్యాలని తన భార్యను అడిగాడు. తన పరివారం వాళ్ళను మోసగించటానికి, తానే తన కూతురును కొడుకని ఇంత కాలేమూ భ్రమపడినట్టు నటించాడు.

తన తల్లి దండ్రులకు కలిగిన కష్టం చూసి, శిఖండి ప్రాణత్యాగం చేయ నిశ్చయించి, ఇల్లు విడిచి కీకారణ్యాలకు వెళ్ళిపోయింది. ఆ అరణ్యం స్థూణాకర్ణు డనే యక్షుడి పాలనలో ఉన్నది. శిఖండి ఆ వనంలో కొన్ని రోజులు ఉపవాసాలు చేసిన మీదట యక్షుడు ఆమెను చూసి, "నువు ఇక్కడ ఎందు కున్నావు? నీకు ఏంకావాలి? సహాయం చేస్తాను," అన్నాడు.



"నాకు సహాయం చెయ్యటం నీ తరం కాదు," అన్నది శిఖండి.

"నేను కుబేరుడి మిత్రుణ్ణి, నువు కోరిన వరం ఇవ్వగలను," అన్నాడు యక్షుడు.

తాను మగవాడుగా పెరిగి, ఆడపిల్లను పెళ్ళాడటమూ, అందువల్ల తన తండ్రికి వచ్చిన విపత్తూ గురించి శిఖండి యక్షుడికి తెలిపింది.

"నేను నీకు కొంత కాలం పాటు నా పురుషత్వం యిచ్చి, నీ స్త్రీత్వం నేను తీసుకుంటాను. మీ తండ్రికి కలిగిన ఆపద గడవగానే మళ్ళీ నా పురుషత్వం నా కిచ్చి నీ స్త్రీత్వం నువు తీసుకో," అన్నాడు యక్షుడు.

శిఖండి పరమానందం చెంది, అలాగే చేస్తానన్నది.

ఆడదిగా వెళ్ళిన శిఖండి మగవాడుగా తిరిగి వచ్చేసరికి ఆమె తల్లిదండ్రులు అపరిమితమైన ఆనందం పొందారు. "నా కొడుకు మగవాడే; కావలిస్తే వచ్చి చూసుకోవచ్చు." అని ద్రుపదుడు దశార్ణరాజుకు కబురు పంపాడు. దశార్ణరాజు ఈ మాట నిజమో కాదో తెలుసుకునేటందుకు కొందరు స్త్రీలను పంపాడు. వాళ్ళు శిఖండిని అనేక విధాల పరీక్షించి, తిరిగి వెళ్ళి, శిఖండి పురుషుడే నని దశార్ణరాజుకు తెలిపారు. దశార్ణరాజు స్వయంగా వచ్చి, ద్రుపదుడి మీదా, శిఖండి మీదా చాలా గౌరవం ప్రదర్శించి, తనకు అబద్ధం చెప్పిన కుమార్తెను కోప్పడి, తిరిగి వెళ్ళాడు.

ఈలోపల కుబేరుడు విమానం మీద తిరుగుతూ స్థూణాకర్ణుడుండే వనానికి వచ్చి, స్థూణాకర్ణుడు తనను చూడరానందుకు ఆశ్చర్యపడ్డాడు. యక్షుణ్ణి తీసుకు రావటానికి వెళ్ళిన కుబేరుడి దూతలు ఆడదిగా ఉన్న స్థూణాకర్ణుణ్ణి కుబేరుడి వద్దకు తెచ్చారు. యక్షుడు స్త్రీ అయిపోవటానికి కారణం విని, కుబేరుడు ఆగ్రహించి, "ఎప్పటికీ ఆడదిగానే ఉండిపో!" అని శపించాడు. మిగిలిన వాళ్ళంతా శాపాంతం చెప్పమని ప్రాధేయపడిన మీదట కుబేరుడు, శిఖండి చనిపోయిన అనంతరం యక్షుడికి మగతనం తిరిగివచ్చేటట్టు అనుగ్రహించాడు.

తరవాత శిఖండి యక్షుడి వద్దకు వచ్చి, "అయ్యా, మా ఆపద తప్పింది. ఇక మీ పురుషత్వం మీరు తీసుకోండి." అన్నాడు. యక్షుడు తనను కుబేరుడు శపించాడనీ, పురుషత్వాన్ని శిఖండి జీవితాంతం ఉంచుకోవచ్చుననీ చెప్పి, పంపేశాడు.

భీష్ముడు ఈ విధంగా శిఖండి వృత్తాంతం చెప్పి, "అంబ శిఖండిగా పుట్టింది. ఆడదిగా పుట్టిన వాళ్ళనూ, ఆడపేరుగల వాళ్ళనూ, ఆడవేషంలో తిరిగే వాళ్ళనూ చంపనని నా వ్రతం. అందుకే శిఖండితో యుద్ధం చెయ్యను, శిఖండిని చంపనని అన్నాను." అన్నాడు.






దక్షిణ భారతంలో మహిళారూప్య మనే నగరాన్ని అమరశక్తి అనే రాజు పాలించేవాడు. ఆయన శక్తివంతుడు, ధీమంతుడు, దయావంతుడు; లలిత కళాకౌశలమూ, రాజకీయ చతురతా కలవాడు.

ఆయనకు వసుశక్తీ, ఉగ్రశక్తీ, అనేకశక్తీ అని ముగ్గురు కుమారులు. వారికి చదువు రాలేదు, లోకజ్ఞానం లేదు. వారికి రాజనీతీ, రాజతంత్రమూ, సాధారణ జ్ఞానమూ సైతం లేకపోవటం చూసి రాజుకు విచారం కలిగింది.

ఆయన ఒకనాడు తన మంత్రులను పిలిచి, "నా కొడుకులు మూఢులన్న సంగతి మీ రెరుగుదురు. జ్ఞానమూ, సద్బుద్ధీ లేని కొడుకు గొడ్డుమోతు ఆవు లాగా నిరర్థకం. అలాటి కొడుకులను కనేకన్న భార్య గొడ్రాలుకావటం మేలు; సన్యసించటం మేలు. అందుచేత నా కొడుకులలో జ్ఞానాన్ని వికసింపచేసి, వారిలో రాజనీతీ, పరిపాలనా దక్షతా కలిగించేమార్గం ఏదో చెప్పండి." అన్నాడు.

"ఈ నగరంలోనే విష్ణుశర్మ అనే గురువు ఉన్నాడు. ఆయన సమస్తకళలను కాచి వడబోసినవాడు. అంతే కాదు, ఆయన అమిత సులువుగా విద్యాబోధ చెయ్యగలడు. ఆయనకు మహారాజుగారు తమ కుమారులను అప్పగించినట్టయితే అతి శీఘ్రకాలంలో ఆయన వారిని రాజనీతిలోనూ, ప్రపంచ జ్ఞానంలోనూ ఆరితేరేటట్టు చేయగలడు." అని ఒక మంత్రి చెప్పాడు.

రాజు విష్ణుశర్మను పిలిపించి, తన కొడుకులకు రాజనీతీ, వివేకమూ నేర్పినట్టయితే నూరుగ్రామాలు బహుమానంగా ఇస్తానన్నాడు.

"మహారాజా, నేను విద్యను విక్రయించను. ఎనభైఏళ్ళవాణ్ణి. నాకు ధనం

అట్ట చివరి బొమ్మ



ఎందుకు? అడిగిన వారికి విద్యాదానం చెయ్యటం నా విధి. ఆరుమాసాలలో నేను మీ పిల్లలకు రాజనీతీ, వివేకమూ కలిగిస్తాను," అన్నాడు విష్ణుశర్మ.

రాజు సంతోషించి, తన పిల్లలను ఆయనకు అప్పగించాడు: ఆయన వారికి పంచతంత్రం అనేది అయిదు భాగాలుగా చెప్పాడు. ఆ భాగాలేవంటే, మిత్రభేదం, మిత్రసంప్రాప్తి, కాకోలూకీయం, లబ్ధప్రణాశం, అపరీక్షితకారకం.

విష్ణుశర్మ చెప్పిన ఈ పంచతంత్రం ద్వారా రాజకుమారులు అయిదు మాసాలలో రాజనీతిలోనూ, లోకజ్ఞానంలోనూ ఆరితేరిన వారైనారు.

### 1. సింహమూ, ఎద్దు.

దక్షిణదేశంలో మహిళారూప్య మనే నగరంలో వర్ధమాను డనే వర్తకుడు ఉండేవాడు. ఆయన గొప్ప ధనికుడూ, నీతిపరుడూ, దాతకూడానూ. ఆయన ధనాన్ని తేలికగా సంపాదించి, వివేకంతో ఖర్చు చేసేవాడు.

ఒకనాడు ఆయన రెండెడ్లబళ్ళ మీద ఖరీదైన వర్తకపు సరుకులు వేసుకుని, యమునా తీరాన గల మధురానగరానికి బయలుదేరాడు. ఒక బండికికట్టిన నందికం, సంజీవకం అనేవి మేలైన ఎద్దులు.

కొన్నాళ్ళకు బిడారు యమునా తీరానగల అడవిని చేరుకున్నది. ఆ అడవిలో అనేక రకాల చెట్లూ, అడవి జంతువులూ ఉండేవి. ఇక్కడ సంజీవకం అనే ఎద్దు బురదనేల మీద కాలుజారి, మడమ విరిగి, పడిపోయి, కదలలేకపోయింది. బండివాడు వర్ధమానుడికి ఈ సంగతి చెప్పాడు.

వర్ధమానుడు ఎంతో చింతించి, అయిదు రోజులపాటు ప్రయాణం నిలిపి, సంజీవకానికి చికిత్సలు చేయించాడు, కాని ప్రయోజనం లేకపోయింది. ఆయన శీఘ్రంగా మధుర చేరుకుని, పని చూసుకోవలిసి ఉండటం చేత, సంజీవకానికి బండివాణ్ణీ, మరొక సేవకుణ్ణీ తోడు ఉంచి, తగినంత మేతా, డబ్బూ వారికి ఇచ్చి, "ఎద్దును

శ్రద్ధగా సంరక్షించి, బాగుకాగానే నా వద్దకు తీసుకురండి. ఒకవేళ అది చావటం జరిగితే, దానికి శ్రద్ధగా దహన సంస్కారాలు జరిపి మీరు వచ్చెయ్యండి." అన్నాడు.

ఇలా చెప్పి ఆయన తన బళ్ళనూ, సరుకునూ మధురకు తరలించుకుని వెళ్ళిపోయాడు. ఆ ఇద్దరు మనుషులూ ఒంటరిగా అడవిలో ఉండటానికి భయపడి, ఎద్దును అక్కడే వదిలేసి, మర్నాడే తమ యజమానిని చేరుకుని, ఎద్దు చచ్చిపోయిందని చెప్పారు.

అయితే అదృష్టవశాన సంజీవకం కోలుకున్నది. అది క్రమంగా లేచి, కుంటుతూ తిరగ సాగింది. అది నింపాదిగా నడుచుకుంటూ, అరణ్యంగుండా యమునానది ప్రవహించే చోటుకు చేరుకున్నది. అది నది ఒడ్డున గల పుష్టికరమైన గడ్డిమేసి, స్వచ్ఛమైన నదీ జలం తాగి త్వరలోనే బలాన్నీ, ఆరోగ్యాన్నీ పొంది, శివుడి వాహనమైన నందికి సమానంగా తయారైంది.

ఆ అరణ్యంలోనే పింగళకం అనే సింహం, నక్కలనూ, ఇతర జంతువులనూ పరివారంగా పెట్టుకుని నివసిస్తున్నది. ఆ సింహం ఒకనాడు యమునలో నీరు తాగబోయి, సంజీవకం పెట్టిన పెద్ద రంకె విని, అలాటి భయంకర ధ్వనిచేసే ప్రాణి ఏమై ఉంటుందో తెలియక బెదిరిపోయింది.



అది తన భయాన్ని పైకి తెలియనివ్వక, నీరు తాగే ప్రయత్నం మాని, మర్రిచెట్టు కింద తన నివాసానికి తిరిగి వచ్చి, జరిగిన దాన్ని గురించి ఆలోచించ సాగింది. ఇతర మృగాలు దాన్ని పరివేష్టించి ఉన్నాయి. భయపడి నప్పటికీ దాని గాంభీర్యం తగ్గలేదు. మృగరాజుకు మనిషి రాజులలాగా అభిషేకమూ, దుస్తులూ, చదువులూ, అవసరం లేదు. ప్రకృతే దానిని రాజుగా సృష్టించింది.

సింహం వెంట ఉన్న జంతువులలో కరటకమూ, దమనకమూ అనే రెండు నక్కలున్నాయి. అవి పూర్వం సింహం కింద కొలువు చేసిన జంతువు బిడ్డలు.

ప్రస్తుతం వాటికి పదవి లేదు. సింహం నది దాకా వెళ్ళికూడా నీరు తాగకుండా తిరిగి రావటం దమనకం గమనించింది. అది తన తోబుట్టువైన కరటకాన్ని ఎడంగా తీసుకు పోయి, "మన ఏలిక అయిన పింగళ కాన్ని చూశావా? నీరు తాగటానికి యమున వద్దకు వెళ్ళింది. నీరు తాగకుండా అకస్మి కంగా ఎందుకు తిరిగి వచ్చిందీ? దాని ముఖం దీనంగానూ, విహ్వలంగానూ ఎందుకు ఉన్నదీ?" అన్నది.

దానికి కరటకం, "తమ్ముడూ, రాజుకు సంబంధించిన విషయాలలో జోక్యం కలి గించుకోకు. అలా చపలచిత్తంతో లేనిపోని విషయాలలో జోక్యం కలిగించుకునే వాళ్ళు సీల పెరికిన కోతి లాగా వెంటనే నశించి పోతారు," అన్నది.

"అదెలాగ?" అన్నది దమనకం.

కరటకం చిలిపికోతి కథ ఇలా చెప్పింది:

ఒక నగరం వెలపల ఒక వర్తకుడు ఆలయం కట్టిస్తున్నాడు. ప్రతిరోజూ మధ్యా హ్నం వేళ పనివాళ్ళు తిండి తినటానికి నగరానికి పోతారు. ఆ ప్రదేశమంతటా పెద్ద పెద్ద దుంగలను రంపాలతో కోస్తారు.

ఒకనాడు, కట్టుతూ ఉన్న దేవాలయం దగ్గిరికి కోతుల మంద వచ్చింది. ఒక బ్రహ్మాండమైన మాను సగం కోసి ఉన్నది. పనివాళ్ళు కోత ఆగిన చోట దుంగలో ఒక సీల గుచ్చారు.

కోతులన్నీ గెంతుతూ ఆడుతూ ఉంటే ఒక చిలిపి కోతి ఆ సీలను చూసి, "ఇది ఇక్కడ ఎందుకున్నదీ?" అనుకుని, సీలను రెండు చేతులా పట్టి బలం కొద్దీ పెరికింది. సీల లాగగానే, ఎడంగా ఉన్న దుంగ భాగాలు కలుసుకున్నాయి. కోతి వాటి సందున నలిగి చచ్చిపోయింది.

కరటకం ఈ కథ చెప్పి, "అందుకే నువు లేనిపోని విషయాల జోలికి పోవద్ద న్నాను. పిచ్చివాడా, మనకు కొలువు లేక పోయినా, ప్రభువు వదిలిన ఆహారం తిని బాగానే బతుకుతున్నాం. ఈ కాస్త పొగొట్టు కోవటం దేనికి?" అన్నది.

—(ఇంకా వుంది)



# 139. ప్రపంచంలో కెల్లా పెద్ద గడియారం

అమెరికాలోని న్యూజెర్సీ రాష్ట్రంలో, జెర్సీనగరంలోని "కాల్గేట్-పామాలివ్-పీట్" ఫాక్టరీ పైన ఈ గడియారం ఉన్నది. దీని "ముఖం" వెడల్పు 50 అడుగులు. బొమ్మలో మనిషికి ఉభయ పార్శ్వాలా కనిపించే గుర్తులు "5 నిమిషాల" గుర్తులు; ఒక్కొక్కటి 7 అడుగుల ఎత్తు. నిమిషాల ముల్లు రోజుకు ఇంచుమించు 6 ఫర్లాంగులు నడుస్తుంది. గడియారం ముఖాన్ని 345 బల్బులు వెలిగిస్తాయి.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

చిన్ననాటి స్నేహం

పంపినవారు:
జి. సిహెచ్. గోపాలరావు

Photo by Anant Desai



పాత గుంటూరు,
గుంటూరు-522001

చిత్రమైన స్నేహం

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు జూలై నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు సెప్టెంబరు నెలసంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్టు:
తెడ్ల పడవ

మూడవ అట్టు:
తెరచాప పడవ


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




# "నా పుట్టిన రోజొస్తోంది, నాన్నా... నాకొక కేమెల్ రంగుల పెట్టె కావాలి."

నాన్నా, రాజు దగ్గర ఒక కేమెల్ రంగుల పెట్టె వుంది. వాడు వాటితో ఎంత చక్కటి బొమ్మలు వేస్తాడను కున్నావు? ఆ రంగులు ఎంతో అందంగా, మెరిసిపోతూ ఉంటాయి. అవి చాలా కాలం ఉంటాయని వాడన్నాడు. అందుకని, నాపుట్టిన రోజుకు నాకొక రంగుల పెట్టె కావాలి. అది నాకు తెచ్చి పెడతావా నాన్నా?

# కేమెల్
## ఆర్ట్ కలర్స్





కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్,
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్,
జె.బి.నగర్, బొంబాయి 400 059
(ఇండియా)

PRATIBHA 1813-8-TEL

# ఈ బాలురలో ఎవరికి తనతల్లి ఇన్‌క్రిమిన్* ఇస్తుంది?

నిజమే మీరు కనుగొన్నది!



ఆడుతూ పాడుతూ వెరగాలి




డ్రాప్స్: 2 నెలల నుండి
2 ఏళ్ళ పసిపాపలకు
సిరప్: 14 ఏళ్ళ
లోపు పిల్లలకు

## ఇన్‌క్రిమిన్* టానిక్

ఇన్‌క్రిమిన్ అధిక ఆహారాన్ని
అధిక పెరుగుదలగా మారుస్తుంది




డాక్టర్లు విశ్వసించే పేరు Lederle
అమెరికన్ సయానమిడ్ వారి విభాగము

* అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్

SISTA'S/INC/959 TEL

